# సమర్థ సద్గురు

## ఆధ్యాత్మిక మాసపత్రిక

శ్రీకాళీగార్డెన్స్ ఆశ్రమం - 522508, గుంటూరు జిల్లా
ఫోన్ : (0863) 2293280, 2293564, 2293206
web: www.mathaji-babuji.org samardhasadguru@rediffmail.com



Volume 28 Issue 12
No.of Pages 40
AUGUST 2009

| | | |
|---|---|---|
| 5సం॥లచందా | రు. | 250.00 |
| 2సం॥ల చందా | రు. | 120.00 |
| సంవత్సర చందా | రు. | 60.00 |
| విడిప్రతి వెల ..... .. | రు. | 5.00 |

బ్యాంక్ డ్రాఫ్ట్ A/C.Y.S.C.K.P.M చారిటబుల్ ట్రస్ట్ పేరులో డ్రా చేయండి. M.O.,బ్యాంక్ డ్రాఫ్ట్స్ పంపవలసిన చిరునామా:
మేనేజరు
సమర్థసద్గురు మాగజైన్
శ్రీకాళీగార్డెన్స్-522508

Printed, Published by C.V. Ramana Babu, on behalf of YOGINI SRI CHANDRA KALI PRASADA MATHAJI CHARITABLE TRUST and Printed at Samardha Sadguru Publications, D.No. 3-499, Sri Kali Gardens Ashram, Nambur - 522508, Guntur Dist., Andhra Pradesh, and published at D.No. 3-499, Sri Kali Gardens Ashram, Nambur - 522508, Guntur Dist., Andhra Pradesh. Editor - Guda Siva Rama Murthy,

| ఈ సంచికలో.... | పేజీ |
|---|---|

# భద్రవాక్యం

**నా z విరతో దుశ్చరితా నా z శాంతో నా z సమాహితః।**
**నా z శాంతమనసోవాపి ప్రజ్ఞానే నైన మాప్నుయాత్॥**

-కఠోపనిషత్

ఇది కఠోపనిషత్, ద్వితీయవల్లిలోని 24వ మంత్రం. ఇంతకుముందు మంత్రంలో ఈ ఆత్మ వేదాధ్యయనముచేతగాని, మేధస్సుచేతగాని, చాలాసార్లు (ఉపనిషత్తులకన్నా అన్యమైన) అనేక భిన్నభిన్న శాస్త్రములను చదువుట లేదా వినుటచేతగాని లభ్యం అయ్యేదికాదు, కాని ఏ సాధకుడు అన్యమును కోరక కేవలము ఆత్మనొక్కదానినే కోరుకొనునో, అతనికి మాత్రమే ఆత్మ తన నిజరూపంతో సాక్షాత్కరిస్తుంది అని చెప్పి, ఈ మంత్రంలో ఎటువంటివారు ఆత్మానుభూతిని పొందజాలరో, ఆత్మతత్త్వమును ఎలా అందుకోవచ్చో ఉపనిషత్తు చెప్తున్నది.

దుశ్చేష్టలనుండి, నిషిద్ధకర్మలనుండి మరలనివాడు, చిత్తవృత్తులవలన, ఇంద్రియలోలత్వం వలన మనస్సు శాంతంగాలేనివాడు, మనస్సును సమాహితము లేదా ఏకాగ్రము చేయలేనివాడు, మనశ్చాంచల్యము తగ్గినా సమాధిఫలములైన అణిమాద్యష్టసిద్ధులపై ఆశ చావనివాడు ఈ ఆత్మను అందుకోలేడు.

కాని శాస్త్రమును గురుముఖతః శ్రవణం చేసి, ఆచార్యోపదేశాన్ని మననంచేసి, నిదిధ్యాసనం ద్వారా దానిని ఆచరణలోకి ఎవడు తెచ్చుకుంటాడో అట్టివాడు ప్రజ్ఞచేత ఈ ఆత్మను తన నిజస్వరూపంగా దర్శించగలుగుతాడు.

శ్రీ మాతాజీవారు తమబోధామృతంలో ఎన్నోసార్లు చెప్తూఉంటారు. జిహ్వేంద్రియానికి, ఉపస్థేంద్రియానికి కనెక్షను. మితమైన, హితమైన ఆహార నియమంద్వారా జిహ్వచస్తే తప్ప ఉపస్థేంద్రియం చావదు. మితనిద్ర, మితాహారం, మితభాషణం ఎవరికి ఉంటాయో వారికి శమాదిషట్కసంపత్తి వస్తుంది. శమాదిషట్కసంపత్తి ఉన్నవారికి మనోనిగ్రహం అదే తన్నుకుంటూ వస్తుంది.

అటువంటివారినే ఈ ఆత్మఅనుగ్రహించి తాను వారి స్వస్వరూపంగా సాక్షాత్కారానుభూతిని ప్రసాదిస్తుంది. *

## అమ్మ ఆశీస్సులు

**యస్య సర్వే సమారంభాః కామ సంకల్ప వర్జితాః।**
**జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణం తమాహుః పణ్డితం బుధాః॥**

భగవద్గీత - 4వ అధ్యాయం - 19వ శ్లో॥

శ్రీ సద్గురు దేవులు అనేక మార్లు చెపుతూ ఉండేవారు. ఎవరియొక్క సర్వ కార్యక్రమములు కామసంకల్పములను విడిచి ఉంటాయో వారి కర్మలు జ్ఞానమనే అగ్నిచేత (ధ్యానాగ్ని అని మీ హృదయ బాబు చెబుతున్నారు) దహింప బడినవో వారు బుధులు (విజ్ఞులు) అని పండితుల చేత చెప్పబడినది.

ఎవరి స్వధర్మమును వారు ఆచరించవచ్చు. కాని కామాది గుణరహితమై పవిత్ర అంతఃకరణ కలిగి ఉండాలి. మల్లెపుష్పము నుండి దుర్గంధము రాదు. బురద గుంట నుండి సుగంధము రాదు. అటులనే పవిత్ర అంతఃకరణ నుండి పవిత్ర భావములనే మనము అందుకోగలము. అలాగే హరినామములో మునిగి తేలుతున్న ప్రహ్లాదుడు మాట, బాట, ఆహారము అన్ని సమయములలోను పరిమళము వెదజల్లుతూనే ఉన్నాడు.

**పానీయంబులు ద్రావుచున్ గుడుచుచున్ భాషించుచున్ హాస లీ**
**లా నిద్రాదులు సేయుచున్ దిరుగుచున్ లక్షించుచున్ సంతత**
**శ్రీనారాయణ పాద పద్మయుగళీ చింతామృతా స్వాద సం**
**ధానుండై మరచెన్ సురారి సుతుడే తద్విశ్వమున్ భూవరా ॥**

భాగవతము - సప్తమస్కంధము

మరి హిరణ్యకశిపుడు రాక్షస స్వభావముతోనే కుమారుడని కూడ చూడకుండా ప్రహ్లాదుని ఎన్నెన్ని ఇబ్బందులపాలు చేసినాడో మనకు తెలుసు. కాని ప్రహ్లాదుడు విశ్వాసముతో కొంచెముకూడ బెదురు పడలేదు.

అటువంటి దృఢదీక్ష, పట్టుదల, గట్టి నమ్మకము కలిగి ఉండాలి. అదియే మనకు రక్ష.

- మీ అమ్మ

# సంపాదకీయం

శ్రీ గురుదేవుల దివ్య ఆశీస్సులతో జులై 7వ తేదీ నాడు గురుపూర్ణిమను ఆశ్రమంలో సత్సంగంతో, సద్గురుదేవుల పాదపూజతో ఎంతో భక్తి భరితంగా జరుపుకున్నారు. పురుషసూక్త, శ్రీసూక్త, రుద్ర నమక చమకముల, దశశాంతుల, ఉపనిషత్తుల పఠనం మధ్య భక్తులందరూ ఒక్కొక్కరే గురు పాదుకలకు అభిషేకం చేసికొన్నారు. సత్సంగ కార్యక్రమంలో సుషుమ్న ప్రసాద, రమణ ప్రసాద్, జపమాల ప్రసాద, విజయేశ్వరానంద ప్రసాద్ గారల ఆధ్యాత్మిక ప్రసంగాల అనంతరం శ్రీమాతాజీవారు తమ బోధామృతాన్ని అందించారు. భక్తుల నమస్కారాలతో గురుదేవులు వారికి ప్రసాదించిన రక్షలతో మహా ప్రసాదంతో ఆనాటి కార్యక్రమం ముగిసింది.

శ్రావణమాసంతో పాటు వర్షర్తువు, చాతుర్మాస్య దీక్ష కూడ ప్రారంభం అయ్యాయి. వర్ష ఋతువు సంచారానికి అనుకూలంగా ఉండదు గనుక ఆషాఢ పూర్ణిమ నుండి (కొందరు తొలి ఏకాదశి నుండే ప్రారంభిస్తారు.) ప్రారంభించి కార్తీక పూర్ణిమ వరకు నాలుగు నెలలు, తమ నిత్య నైమిత్తిక అనుష్ఠానానికి అనుకూలంగా ఉండే స్థానం ఎన్నుకొని యతులు అక్కడ సత్సంగాలు, సత్ప్రసంగాలు ఉపనిషత్పఠనము, విచారణ వంటి కార్యక్రమాలలో తమ సమయాన్ని సద్వినియోగం చేస్తారు. అది వారికి అవసరమై కాదు. మనకోసమే. దానిని గుర్తించి మనం అందరమూ కూడా కనీసం ఆ నాలుగు నెలలైనా, మన కాలాన్ని అలా సద్వినియోగం చేసుకోవాలి.

ఈ నెలలో కాళీవనాశ్రమ భాగ్యనగర్ శాఖవారు 7,8,9 తేదీలలో శ్రీశ్రీశ్రీ వీరాంజనేయ స్వామి నీలకంఠేశ్వర స్వామి దేవాలయ ప్రాంగణంలో (కే.పి.హెచ్.బి. కాలని) సత్సంగ కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. ఆశ్రమ శాఖ ఉదయం కార్యక్రమాలు ఆశ్రమ శాఖా భవనంలో జరుగుతాయి శ్రీకాళీవనాశ్రమంలో ఆగస్టు నెలలో జరిగే సత్సంగ కార్యక్రమాలు 13,14,15 తేదీలలో శ్రీ కృష్ణాష్టమి వేడుకలతో పాటు జరుగుతాయి(భక్తులు సవరణను గుర్తింప ప్రార్థన) 13,14,15 తేదీలలో జరిగే శ్రీ కృష్ణాష్టమి వేడుకలలో, 14వ తేది సామూహిక రాధాకృష్ణ పూజలు జరుగుతాయి. 23వ తేది వినాయక చతుర్థి. అందరూ అన్ని కార్యక్రమాలలో పాల్గొని సద్గురు దేవుల కృపకు విశేషంగా పాత్రులు కావాలని ప్రార్థిస్తూ---

- గౌరవ సంపాదకుడు

# బాబూజీ ఉవాచ

(గత సంచిక తరువాయి) - స్వామి విజయేశ్వరానంద ప్రసాద్

మానవుడు యీనాడు ఎన్నో పరిశోధనలు చేస్తున్నాడు. ఎంతో విజ్ఞానాన్ని అభివృద్ధి చేసుకుని శరీరసుఖం కోసం ఎన్నో సౌకర్యాలను సృష్టించుకుంటున్నాడు. కాని సౌకర్యాలు పెంచుకున్న కొద్దీ ప్రమాదాలు ఎక్కువవుతూనే ఉన్నాయి. విమానాలు పడిపోతున్నాయి. Accidents జరుగుతున్నాయి. పరిమితమైన యీ మానవ సృష్టిలో యిన్ని ప్రమాదాలు జరుగుతున్నాయిగాని, పరమాత్మ సృష్టించిన యీ బ్రహ్మాండాలన్నీ ఎంతో క్రమశిక్షణతో వాటి వాటి హద్దులను అతిక్రమించ కుండా, ఎంతో వేగంతో పరిభ్రమిస్తున్నా, ఎటువంటి accident కూడ జరగకుండా నిలిపి ఉంచగలిగిన మహత్తరశక్తి ఏది? అదేపరమాత్మ శక్తి. రక్షణశక్తి.



ధనధాన్యాదులు, దారాపుత్రాదులు మానవుని రక్షించలేవు. దారాపుత్రాదులు మనలను రక్షిస్తారని, వాళ్ళు పిండాలు వేస్తేగాని మనం తరించమని అనుకోవటం అజ్ఞానము. ఇది మమకారం వల్లవస్తుంది. అహంకార మమకారములు మహాజిడ్డు. అది చచ్చే సమయంలో కూడా వదలదు. పైగా ప్రపంచాన్ని గుర్తు చేస్తూ భగవానుని మరపింప చేస్తుంది. ఈ రెండూ విసర్జన చేస్తే, నీవే నేను, నేనే నీవు అని భగవానుడు అన్నాడు.

ప్రాపంచిక ఆనందం ఎంతో మార్పుతో కూడినది;క్షణికమైనది. కాని ఆత్మానందము మార్పులేనిది;శాశ్వతమైనది. ఎంత ఆస్తి ఉన్నా, బంధువులు ఎంత ప్రేమగా చూసినా, ఆ ఆనందం నిలిచేది కాదు. మనస్సుకు క్షణమైనా శాంతిలేదని వాపోతారు మానవులు. ఎందువల్ల? శాంతిని ప్రసాదించే వస్తువును మరచారు. దానికి దూరమైపోతున్నారు. మంచుగడ్డ మీద చెయ్యి పెట్టి వేడి కావాలంటే వస్తుందా? చల్లని శాంతిని, హాయిని యిచ్చే పరమాత్మ పాదారవిందాలయందు మనస్సును ఉంచకపోవటం తప్పుకాదా? విషయాదుల యందు మనస్సును ఉంచుతారు. వచ్చేది అశాంతి, కష్టాలు. ఇంకా ప్రబలమైతే క్రోధాలు, ఆవేశాలు, నరకబాధ. ఎవరిది ఈ తప్పు?

ఎన్నో జన్మల పుణ్యం రాశీభూతమై లభించింది ఈ మానవ జన్మ. దీనిలో, మనకు ఎప్పుడు ఏది కావాలో అది అందించేవాడు పరమాత్ముడు. ఆయనను ఎన్నడూ మరవరాదు. ఈ విషయం తల్లి గర్భంలో ఉన్నప్పుడే భగవానుడు బిడ్డకు నేర్పుతాడు. కాని ఆ బిడ్డ బయటకు రాగానే మాయ ఆవరిస్తుంది. భగవానుని మరపిస్తుంది. ఏమి మరచిపోయాడో, ఏమి కోల్పోయాడో తెలియక ఏడుస్తాడు ఆ బిడ్డ. అందరూ సంతోషిస్తారు.

కనుకనే దయాళువైన దేవకీ నందనుడు మనకు గీతను అందించాడు. కౌసల్యా తనయుడైన శ్రీరామచంద్ర ప్రభువు, సీతారామాంజనేయము అనే బోధ ద్వారా హనుమానునికి, మనకు తరించే మార్గాన్ని అందించారు. ఎంతో గొప్పవైన వేదముల సారమంతటిని వారు ఇలా తేలికగా అందించారు. పోతన మహాత్ముడు ఆ వేదసారాన్నే, ఇంకా తేలిక మాటలతో భాగవతం ద్వారా అందించాడు.

సర్వ పాపాలను హరించి ఆనందమును ప్రసాదించేవి పరమాత్ముని దివ్య చరణాలు. అవి భవలతలను త్రుంచగలవు. సర్వ కలుషాలను హరించగలవు. అంతులేని ఆత్మానందాన్ని అందించగలవు. మానవుడు సదా ఆ పరమాత్ముని చరణాలయందే మనస్సునుంచాలి. వాటినే ప్రేమించాలి.

మనస్సు మానవుని మోసం చేస్తుంది. అది మోసగాళ్ళలో గొప్పది. ఆ మోసంలో పడకుండా మంచిని తెలుసుకోవాలంటే సద్గురువును ఆశ్రయించి సేవించుకోవాలి. ఆయన ప్రేమకు పాత్రుడు కాగలిగితే పాతకములన్నీ హరిస్తాయి. పరమాత్మకు సద్గురువుకు తేడా లేదు. సమర్థుడైన గురువుకావాలి. అట్టి పరమహంస స్వరూపులు మన దేశంలో ఎంతోమంది ఉద్భవించారు. భగవంతుని తమ బిడ్డగా పొంది తరించిన యశోద, దేవకి, కౌసల్య, వసుదేవుడు, దశరథుడు మొదలైనవారున్నారు. వడ్డీ కాసులవాని తల్లిగా తరించింది వకుళమాత. తన కృతులన్నీ శ్రీరామచంద్ర ప్రభువు చరణారవిందాలకు అంకింతం చేసుకుని, రామభక్తి అనే తరగని సంపదను గడించాడు త్యాగయ్య. దానిముందు తంజావూరు రాజు పంపిన ధనం తృణప్రాయమని గ్రహించాడు. మానవుల స్తుతి దుఃఖ కారణమని, రాముని స్తుతిస్తే మోక్షమని తెలుసుకున్నాడు. మనస్సును అలా ఉద్బోధించుకుని తరించిన మహనీయుడు త్యాగయ్య.

-సశేషం

# మాతాజీ అభిభాషణ

(గతసంచిక తరువాయి) -జపమాల ప్రసాద

ధ్యానం చేయగా చేయగా మనస్సు లక్ష్యార్థంలో లయించి పోయి, తదాకారాన్ని పొందుతుంది అని మహాత్ములు మనకి బోధ చేస్తున్నారు. గురుదేవులు మనకి లక్ష్యార్థమిచ్చి 'నేను చెప్పినట్లు చేయండి చాలు. మీకు బలాన్ని, మంచి శక్తిని నేనిస్తాను' అని చెబుతున్నారు. వారి యందు అచంచలమైన విశ్వాసాన్ని పెంపొందించుకోవాలి. అప్పుడు మీరు చేరవలసిన గమ్యస్థానానికి చేరుకోగలుగుతారు.



గురుదేవులు మనకి సాధనకు కావలసిన పరిపూర్ణ వాతావరణాన్నిచ్చి, భౌతిక జీవితానికి కావలసిన పరిపూర్ణ వసతులన్నిటినీ కూడా ప్రసాదించి, ఇహపరాలు రెండిటికీ లోటు లేకుండా చేశారు. వారు ప్రసాదించిన మహత్తరమైన అవకాశాన్ని జారవిడుచుకోకుండా సద్వినియోగం చేసుకున్నప్పుడే మన జన్మ సార్థకమవుతుంది.

మహాత్ముల బోధ వినగా వినగా, భగవన్నామ స్మరణ చేయగా చేయగా, శబ్దం పవిత్రమవుతుంది. శబ్దం ద్వారా ఆకాశం, పంచమహాభూతాలు, కడకి మనస్సు పవిత్రమవుతాయి. అటువంటి పరిశుద్ధమైన మనస్సులో భగవంతుని దివ్యచరణారవిందములు నిలిచిపోతాయి. అట్టి పవిత్ర మనస్సు సుఖశాంతులకి నిలయమయిపోతుంది.

ఒకవేళ మీ మనస్సు మీరు చెప్పినమాట వినకుండా మిమ్మల్ని తిప్పలు పెడుతోంది అనుకోండి, అప్పుడు కూడా మీరేమాత్రం నిరాశపడవద్దు. ధైర్యంగా ఆ భగవంతుణ్ణి కీర్తించండి చాలు. మిగతాది ఆయన చూసుకుంటాడు. అన్నమయ్య, త్యాగరాజస్వామి, మీరా ఇత్యాది భక్తులందరూ అదే చేశారు. మహాభక్తులెంతెంతో మంది మనకెంతో జ్ఞానామృతాన్ని వారి వారి అనుభవాల ద్వారా వెదజల్లారు. కానీ వారు దేహధారులుగా మన మధ్య తిరిగినంత సేపూ వారి విలువనెవరూ గుర్తించరు. ఇంకాపోతే వారిననేక హింసలకి కూడా

గురిచేస్తారు. వారు చూపిన బాటలో నడవటం నేర్చుకోవాలి.

త్యాగరాజ స్వామి 'మనసా ఎటులోర్తునే?' అని ఎంతో ఆర్తిగా వేడుకున్నారు తమ మనస్సుని. ఈ కీర్తన నా సాధనలో ఎంతో దోహదం చేసింది. ఆధ్యాత్మిక సాధన చేసే ప్రతి సాధకుడికీ ఎంతో ఉపయోగపడుతుంది ఈ కీర్తన.

ప॥ మనసా ఎటులోర్తునే - నా మనవిని చేకొనవే

అ।ప। దినకర కులభూషణుని - దీనుడవై భజన చేసి దినము గడుపుమనిన
నీవు - వినవదేల గుణవిహీన?

చరణం॥ కలిలో రాజస తామస - గుణములు కలవారి చెలిమి
కలిసి మెలిసి తిరుగుచు మది - కాలము గడుపగనే
సులభముగా కడతేరెడు-సూచనలను తెలియచేయు ఇలను
త్యాగరాజు మాట-వినవదేల గుణవిహీన ॥మ॥

అచ్చ తెలుగులో ఉన్న ఈ కీర్తన అందరికీ బాగా అర్థం అయ్యేదే. మనకేదైనా కష్టం వస్తే ఎవరితో చెప్పుకోవాలి? కేవలం భగవంతుడొక్కడు తప్ప ఎవరు మన బాధని ఆర్చేవారు, తీర్చేవారు? ఏ లోటూ లేకుండా మనని కంటికి రెప్పలా కాపాడేది ఆ ప్రభువే కదా! అటువంటి ఆర్తత్రాణ పరాయణుడైన, సూర్యవంశమునకు మణియైన రామభద్రుని కీర్తించవే, సేవించుకోవే అంటే నా మనసు వినటం లేదే. రజ స్తమో గుణాలతో స్నేహం చేసి, చెట్టాపట్టాలేసుకుని తిరుగుతూ కాలాన్ని వ్యర్థం చేసుకుంటున్నదే ఈ మనసు! సులభంగా కడతేరటానికి అనేక సూచనలు మహాత్ములు ఇస్తున్నా వాటిని పెడచెవిని పెడుతోందే ఈ మనస్సు! అని తన మనస్సు పెడుతున్న తిప్పలని తన ఇష్ట దైవమైన శ్రీరామచంద్రప్రభువుకి విన్నవించుకున్నాడు త్యాగరాజస్వామి. గీతాచార్యుడు....

**దైవీ హ్యేషా గుణమయీ । మమ మాయా దురత్యయా।**
**మామేవ యే ప్రపద్యంతే । మాయా మే తాం తరంతితే ॥**

అందుకే ఆఖరి క్షణం వరకూ భగవన్నామాన్ని చేయాల్సిందే. ఏక్షణంలోనైనా మాయ మనల్ని కబళించి వేయవచ్చు. మహాత్ములని ఆశ్రయించి, వారు చెప్పినట్లు చేస్తే, మాయని దాటవచ్చు. మరణించేంత వరకూ కూడా ప్రభూ! ఇదంతా నీదయే! అనుకోవాలి.

- సశేషం

# సన్నిధిలో సంభాషణ

(గతసంచిక తరువాయి)

- పరాశర ప్రసాద్

మీకు ఇంకొక సంఘటన చెబుతాను. దుర్యోధన కుమారుడు లక్ష్మణ కుమారుడికి శరీరముపైన మచ్చ వచ్చింది. ఘన వైద్యులు ఎవరు ఎంత ప్రయత్నం చేసినా దానిని మాన్పలేక పోయారు. మూలికలు, మందులు, మంత్రాలు, తంత్రాలు ఎన్నో రకాల ప్రయత్నాలు చేశారు. ఫలితం శూన్యం. చివరకి పెద్దలంతా కలిసి లక్ష్మణకుమారుడు ఒక అస్ఖలిత బ్రహ్మచారిచేత తాంబూలాన్ని స్వీకరింపజేస్తే ఆ మచ్చ తప్పక పోతుందని తీర్మానించారు. వెంటనే సభను ఏర్పాటు చేశారు.

సభకు పెద్దలనందరినీ ఆహ్వానించారు. దుర్యోధనుడు తన రాజ్యంలోని బ్రహ్మచారులందరిని ఆహ్వానించాడు. భీష్ముడు, నారదుడు మొదలైనవారంతా సభకు విచ్చేశారు. ఋషులు, యోగులు, మునులు ఎంతోమంది సభకు విచ్చేశారు. కాని సభకు కృష్ణ పరమాత్మణ్ణి మాత్రం పిలవలేదు. కృష్ణుడు కులానికి గొల్లవాడు. గోత్రం ఏమని చెప్పగలం? పోనీ మీసాలైనా ఉన్నాయా అంటే అవీ లేవు. బ్రహ్మచర్యం విషయం ఆలోచిస్తే 16వేలమంది రాచకన్యల సహచర్యం, అష్ట భార్యలు. అటువంటి కృష్ణుణ్ణి ఎలా ఆహ్వానించటం అని దుర్యోధనుడు ఊరుకొన్నాడు. ఆ విషయమే భీష్ముడికి చెప్పాడు. అదే అజ్ఞాన దృష్టి.

కాని భీష్ముడు మాత్రం జ్ఞానదృష్టి కలవాడు కాబట్టి దుర్యోధనుని హెచ్చరించాడు. శ్రీకృష్ణ పరమాత్మ అసలుసిసలైన అస్ఖలితబ్రహ్మచారి కాబట్టి ఆయన్ని ఆహ్వానించకపోవటం అపచారమని ఎంత చెప్పినా వింటాడా దుర్యోధనుడు. హీనుడవగుణంబు మానునా? బొగ్గు పాల కడుగ బోవునా మలినంబు? కాని భీష్ముడు మాత్రం కృష్ణపరమాత్మను సభకు రమ్మనమని మనసారా ప్రార్థించాడు. భీష్ముని ప్రార్థనను మన్నించి కృష్ణపరమాత్మ సభకు విచ్చేశాడు. సభకు ఆహ్వానించక పోయినా కృష్ణుడు తగుదునమ్మా తవ్వా పేరమ్మా అని పిలవని పేరంటానికి విచ్చేసినందుకు దుర్యోధనుడు అపహాస్యం చేస్తాడు. ముందు 24 వరుసలలో మహారాజులు, ఋషులు, యోగులు అంతా ఆసీనులయ్యారు. 25వ స్థానంలో మాత్రం మూడు తరాలనాటి ఒక పాత

కుర్చీవేసి అందులో కృష్ణపరమాత్మను కూర్చోమంటాడు. అయితే ఠీవికి ఆయనకి ఆయనే సాటి. అందానికి ఆయనతో ఎవరు పోటీ పడ గలుగుతారు?

ఆయన ముందు మిగిలిన వారంతా వెలవెల పోయారు. సభకి అంతా విచ్చేశారు. కాని లక్ష్మణ కుమారుని తాంబూలాన్ని స్వీకరించేవారు ఎవరూ లేరు. ఎవరూ ముందుకు రావటానికి సాహసించలేదు. భీష్ముడు కూడా అంబ, అంబిక అంబాలికల విషయంలో ఒక్క నిమిషం మనస్సు చలించటం చేత తాంబూలాన్ని స్వీకరించటానికి సాహసం చేయలేదు. నారదుడు మొదలుగా గల మహర్షులు కూడా సాహసించలేదు.

భీష్మాదులు కృష్ణపరమాత్మకు తాంబూలాన్ని సమర్పించమని సూచన చేశారు. అది దుర్యోధనునికి ఆమోదయోగ్యం కాదు. దుర్యోధనునికి శకుని నచ్చచెబుతాడు. శకుని చేసిన వాదన దుర్యోధనుని మనస్సుకు నచ్చింది. శ్రీకృష్ణపరమాత్మ స్పర్శచేత లక్ష్మణకుమారునికి మచ్చపోతే అంతకన్నా మహాభాగ్యమేమున్నది? పోనీ అలా జరగకపోతే కృష్ణుడు అందరిలో పరాభవం పొందుతాడు. కౌరవులందరికీ కావలసినది అదే కదా! వెంటనే తాంబూలాన్ని శ్రీకృష్ణపరమాత్మకు సమర్పిస్తాడు. ఆయన ఠీవిగా స్పృశించిన వెంటనే మచ్చ తొలగిపోయింది. అది చూసి సభలోవి వారంతా ఆశ్చర్య పోయారు. దుష్టచతుష్టయం పరాభవం చెందుతారు.

ఇంత జరిగినా కృష్ణుణ్ణి ఎంతమంది గుర్తించారు? పరమాత్ముడు సగుణంగా వస్తే మానవాకారంగా మనలాగానే దేహాన్ని ధరించాడు కదా. మనలాగే భోజనం చేస్తున్నాడు. కాళ్ళు చేతులు ఉన్నాయి కాబట్టి ఈయన ఏం భగవంతుడు? అంటారు. అటువంటి వాదనచేసేవారు గురువే పరబ్రహ్మ స్వరూపుడు అంటే ఎలా నమ్ముతారు చెప్పండి? గురుతత్త్వం చాల లోతైనది. దానిని అర్థం చేసుకున్నవారు చాలా తక్కువ. దేహం ఉన్నంత వరకు మానవుడికి మమకారం పోదు. దాని ద్వారా దేహభ్రాంతి దాని ద్వారా జీవ భ్రాంతి తద్వారా లోక భ్రాంతి దారాపుత్రాదుల వ్యామోహం కలుగుతుంది. అయితే దేహం ఉన్నంత వరకే ఈ భ్రాంతులన్నీ. దీనినే దేహభావన అంటారు. దేహం తొలగిపోయిన తరువాత ఎవరికెవరో? దేహాన్ని ప్రకాశింప జేసే వస్తువు ఒకటి ఉంది. అదే ఆత్మ వస్తువు. దానికి ఏ భ్రాంతి లేదు. మమకారం అంతకన్న ఉండదు. దీనిని అర్థం చేసుకోండి చాలు అన్నారు శ్రీబాబు.

-సశేషం

## శ్రీకాళీగార్డెన్స్‌లో విశేషపూజా కార్యక్రమములు

**ఆగష్టు 2009**

| | | |
|---|---|---|
| 5 | బుధ | రాఖీ పూర్ణిమ, శ్రీ సద్గురు పాదపూజ. |
| **13,14,15*** | | **సత్సంగ సమావేశాలు (జులై నెల సంచికలో 9,10,11 అని ప్రచురించటం జరిగింది. పాఠకులు సవరణను గుర్తించ ప్రార్థన.)** |

**13 గురువారము నుండి 15 శనివారము వరకు శ్రీ కృష్ణాష్టమి వేడుకలు**

| | | |
|---|---|---|
| 13 | గురు | ఉదయం 10 గం.లకు కలశస్థాపన,శ్రీ రాధాకృష్ణ అర్చన, భక్త సమారాధన. |
| 14 | శుక్ర | ఉదయం 10 గం.లకు శ్రీ రాధాకృష్ణ సామూహిక పూజలు,శ్రీ సద్గురు పాదపూజ, భక్త సమారాధన. |
| 15 | శని | శ్రీ గురుదశమి, ఉదయం 11 గం.లకు శ్రీ సద్గురు పాదపూజ, సత్సంగం, భక్త సమారాధన. |
| 18 | మంగ | మాసశివరాత్రి. |
| 23 | ఆది | శ్రీవినాయక చవితి, ఉదయం 5గం.30ని.లకు శ్రీ సద్గురు పాదపూజ. ఉదయం 11 గం.లకుశ్రీవిఘ్నేశ్వరస్వామి సామూహిక పూజలు, భక్త సమారాధన. |

**సెప్టెంబరు 2009**

| | | |
|---|---|---|
| 4 | శుక్ర | పూర్ణిమ,శ్రీ సద్గురు పాదపూజ. శ్రీ మాతాజీ అర్థ చాతుర్మాస్యం ఆశ్రమంలో జరుగుతుంది. |
| 5 | శని | టీచర్స్ డే, ఉదయం 10 గం.లకు ఆచార్యదినోత్సవము,శ్రీ సద్గురు పాదపూజ. |
| 14 | సోమ | శ్రీగురుదశమి, సత్సంగం,శ్రీ సద్గురు పాదపూజ. |
| 17 | గురు | మాసశివరాత్రి. |

**19 శనివారము నుండి ,సెప్టెంబరు 30వరకు శ్రీదేవీనవరాత్రోత్సవములు.**

ప్రతిరోజు ఉదయం 8 గం.లకు శ్రీ రామతారక పరబ్రహ్మ ప్రసాద్, మరియు శ్రీవెంకటరమణ ప్రసాద్ గార్లచే శ్రీదేవీ భాగవత ప్రవచనము. మధ్యాహ్నము జగన్మాత కుంకుమార్చనలు, హారతి, మంత్రపుష్పము, దర్బారు, భక్త

సమారాధన  సాయంకాలము 6 గం.లకు ప్రార్థన, 7 గం.లకు జగన్మాత సాయంకాలపూజ, తీర్థ ప్రసాదములు.

20 ఆదివారమునుండి 29 వరకు ఆధ్యాత్మిక ప్రవచనములు, శ్రీమాతాజీవారి అనుగ్రహభాషణము, శ్రీ గురుదేవుల దివ్య దర్శనము,బోధ (వీడియో), శ్రీ బాబూజీ మహరాజ్ వాడిన వస్తువుల మ్యూజియమ్ ప్రదర్శన (అర్థగంట)

| | | |
|---|---|---|
| 19 | శని | ఉదయం 8గం.6ని.లకు శ్రీమాతాజీవారి దీక్షా స్వీకారము |
| 26 | శని | శ్రీ సరస్వతీపూజ, మూలా నక్షత్రం. దుర్గాష్టమి. |
| 27 | ఆది | మహర్నవమి. శ్రీ జగన్మాత సామూహికపూజలు, |
| 28 | సోమ | విజయదశమి, శ్రీ జగన్మాత సామూహికపూజలు, నామకరణములు, అన్నప్రాశనలు, అక్షరాభ్యాసములు రామాలయంలో జరుగుతాయి. |
| 29 | మంగ | ఏకాదశి, ఏకాహం. |
| 30 | బుధ | దీక్షావిరమణ, పూజాక్షతలు శ్రీమాతాజీ భక్తులపైన చల్లుతారు.  రాత్రి 7 గం.లకు జగన్మాత ఊరేగింపు. రాత్రి 9 గం.లకు శ్రీ సద్గురు పాదపూజ. |

**భాగ్యనగర శాఖ సత్సంగ కార్యక్రమములు ఈ నెల 7,8,9 తేదీలలో శ్రీశ్రీశ్రీ వీరాంజనేయస్వామి నీలకంఠేశ్వర స్వామి దేవాలయ ప్రాంగణం (కే.పి.హెచ్.బి. కాలని) లో జరుగుతాయి.**

* * *

**బాష్పాంజలి**

ఆశ్రమ నివాసురాలు పాలూరి సుబ్బారావుగారి సతీమణి, శ్రీమతి పాలూరి సీతారామలక్ష్మి(సీతమ్మ)గారు ది. 22-7-2009న గురుసాయుజ్యం పొందారు. వీరి వయస్సు 82సం॥ వీరికి ఒక కుమారుడు కలడు. గురుదేవులు వారికి మనశ్శాంతిని ప్రసాదించెదరుగాక!

**బాష్పాంజలి**

ఉమా మాష్టారుగారి నాయనమ్మ, రామారావుగారి భార్య లక్ష్మీనరసమ్మగారు (తాడేపల్లి మామ్మ) ది.7-7-2009 వ్యాసపూర్ణిమనాడు గురుసాయుజ్యం పొందారు. ఈమె వయస్సు 83సం॥ వీరికి ఒక కుమారుడు కలడు. గురుదేవులు వీరికి మనశ్శాంతిని ప్రసాదించెదరుగాక!

# సత్సంగ సౌరభం

-రమణ ప్రసాద్

(గతసంచిక తరువాయి)

ఆత్మ ఒక అవస్థలో ఉండి ఇంకొక అవస్థలో లేనిది కాదు. జాగ్రదవస్థలో మనస్సు ఉంది కాబట్టే సుఖ దుఃఖాల అనుభవం కలుగుతోంది. మనస్సు లేకపోతే సుఖమూ లేదు. దుఃఖమూ లేదు. సుఖ దుఃఖాలు మనస్సుకు అధీనములు.

నువ్వు లేకపోతే ఏదీ లేదు. అసలు మనస్సు లేదు. ఉందనుకొన్నవాడికి ఉంది. లేదన్నవాడికి లేదు. తొంగిచూస్తే నీడ ఉంది. నిటారుగా ఉన్నవాడికి నీడ లేదు. నీకు అవస్థలు లేనే లేవు. నీవు సచ్చిదానందరూపుడివి. నీకు మనస్సు ఉన్నదా? ఉన్నా అది నీ చెప్పుచేతలలో ఉంటుంది. విషయాలనుండి తొలగింపబడిన శుద్ధ మనస్సు కలవాడు ప్రపంచ శ్రేయస్సు కోసం కార్యాలు చేస్తాడు. విచారణ ద్వారా మనస్సును తొలగించు. నీ మనస్సే నీకు శత్రువు, మిత్రుడు. నీ మనస్సే బంధానికి, మోక్షానికి హేతువు. అగ్గిపుల్ల కర్పూరం వెలిగించటానికీ ఉపయోగపడుతుంది. కొంప కాల్చటానికీ ఉపయోగ పడుతుంది. అలాగే సంసారంలో ఉండటానికి, బయటపడటానికి మనస్సే కారణం. ఆ మనస్సు శివుణ్ణి ఆశ్రయించి శివుడిగా మారింది. ఆ శివుడిని నంది కొమ్ములమధ్యనుండి దర్శించాలి.

సంకల్ప వికల్పాలు, భక్తి, మెడిటేషన్(ధ్యానం) ద్వారా వడిగా తిరిగే మనస్సును ఆపుచేస్తే మధ్యలో ఖాళీ కనిపించదు. ఫ్యాన్ స్పీడ్‌గా తిరిగితే మధ్యలో ఖాళీ కనిపించదు. భగవానుడు "నీ మనస్సును నా యందు ఉంచు" అంటున్నాడు. ఆయన ఇవ్వమన్నది ఇవ్వం. ఏవేవో ఇస్తున్నాం. తాళంచెవి ఒకటే. అటు తిప్పితే పడుతుంది. ఇటు తిప్పితే తెరుచుకుంటుంది.

తల్లి అబ్బాయితో 'చూడు! తాళాలు ఇక్కడ పెడుతున్నాను. నేను సత్సంగానికి వెళుతున్నాను' అని చెప్పింది. పిల్లవాడు తాళంచెవి తీసికొని ఏడుస్తున్నాడు. ఎందుకు?అని అడిగితే మా అమ్మ వేసే తాళం చెవి ఇక్కడపెట్టి, తీసే తాళంచెవి తనతో తీసుకుపోయింది అన్నాడు, అక్కడే ఉన్న ఒక తెలివైనవాడు 'ఆ తాళంతోనే తెరుచుకుంటుంది' అని చెప్పాడు.

మనస్సు అంతర్ముఖమైతే, సంకల్పాలు లేకపోతే మోక్షప్రాప్తి కలుగుతుంది. కాబట్టి మోక్షానికి ఒక్కటే అడ్డు ఉన్నది.అది మనస్సు. అడ్డుగా ఉన్న మనస్సును తొలగించటానికి భగవంతుణ్ణి ప్రార్థించాలి. అన్నమయ్య శ్రీ

వెంకటేశ్వర స్వామిని **తెరతీయరా, తిరుపతి దేవరా! తెరతీసి మాలోన మోహాలు తొలగించరా!** అని ప్రార్థించాడు.

మనస్సులోనే 'తత్'పదం, 'త్వం'పదం రెండూ ఉన్నాయి. మధ్యలో ఉన్న wall (గోడ) తీసివేస్తే జీవబ్రహ్మల ఏకత్వం తెలుస్తుంది.

'స్వామీ! మనస్సు అంటున్నావు, అందులో రెండు ఉన్నాయి అంటున్నావు. మరి మా గతి ఏమిటి? అంటే, మద్భక్తః - ప్రపంచంవైపు ఉన్న వ్యామోహాలను, స్నేహాలను తొలగించుకొని భగవంతునివైపు మరల్చు. అది నిర్మల భక్తి. కాని మనమేమో బొట్టు పెట్టుకొని, మడికట్టుకొని కొబ్బరికాయలు కొడితే అది భక్తి అనుకుంటున్నాం.

భగవంతుడు రూపానికి అవకాశం ఇవ్వలేదు. గుణాలకు ఇచ్చాడు. భగవద్గీత 12వ అధ్యాయం, భక్తియోగంలో భక్తుని లక్షణాలు చెప్పి, ఇవి ఉన్న భక్తుడు నాకు ప్రియతమమైనవాడు అని చెప్పాడు గీతాచార్యుడు. పూర్తి విశ్వాసంతో నువ్వు ఏది అవాలనుకొంటే అది అవుతావు. నువ్వు కలెక్టర్ కావాలనుకొంటే కలెక్టర్ అవుతావు. నువ్వు భక్తుడవు కావాలనుకొంటే భక్తుడవు అవుతావు.

ఒకడు నేను గాంధీ అవాలనుకొన్నాడు. సరే టెస్ట్ చేద్దామని అద్దంలో చూసుకుంటే తను గాంధీ కంటే భేదంగా ఉన్నాడు. తలపాగా పెట్టుకుంటే... అని తలపాగా పెట్టుకొన్నాడు. సెహబాష్ - 50% అయ్యాను అనుకొన్నాడు. మరి గాంధీకి తలపై జుట్టు లేదు కదా అని గుండు గీయించుకొన్నాడు. ఇప్పుడు 100% అయ్యాను అని తృప్తిగా నవ్వుకున్నాడు. అసలు రహస్యం అప్పుడు బయట పడింది, గాంధీకి పళ్ళు లేవు అని. మరి తనకు ఉన్నాయి. వెంటనే పళ్ళు పీకించుకొన్నాడు. బయట ఆర్భాటాలు కాదు కావల్సింది. సేవాభావం ఉండాలి.

**అనపేక్ష శ్శుచి ర్దక్షః ఉదాసీనో గత వ్యథః।**
**సర్వారంభ పరిత్యాగీ యోమద్భక్త స్సమే ప్రియః॥ భ.గీ 12/16**

ఆత్మేతర వస్తువులందు అపేక్ష లేనివాడు, శీతోష్ణ స్పర్శాది దుఃఖములకు వ్యధ చెందక సమస్త కర్మారంభములను పరిత్యజించి నన్ను భజించువాడు నాకు ప్రియుడు. భగవద్గీతలో భగవానుడు భక్తుని పొగడుతాడు. భక్తుడు లేకపోతే భగవంతుడు లేడు. మనస్సు పెట్టి ప్రార్థిస్తే 100% ఫలితం వస్తుంది. అలాంటి గీతను అందరూ పారాయణ చేయాలి. ఫలాన్ని ఆశించకుండా కర్మలు చేయాలి. తీరిగ్గా జపం చేసికొవాలి. అప్పుడు మనస్సు ప్రశాంతత చెందుతుంది. *

# సంత్ నామదేవ్ చరితామృతం

-మనోజ్ కుమార్

రాజాయి రహస్యంగా డబ్బీతీసి తను దాచిన బంగారు నాణాలకోసం చూసింది. అందులో బొగ్గులు మాత్రమే ఉన్నాయి. మరునాడు నామదేవుడు సంతాజీబాబా పేరుతో జయ జయ ధ్వానాలమధ్య బీదలందరికీ సంతర్పణ చేశాడు. నారా, మహదాలతోపాటు రాజాయికూడ వడ్డనలో పాల్గొన్నది.

అర్ధరాత్రి కావస్తున్నది. రాజాయి, పిల్లలు అలసిపోయి నిద్రిస్తున్నారు. జనిమాత్రం సన్నగా భగవన్నామం చేసుకుంటూ మర్నాడు సంతర్పణకు రొట్టెలకోసం పిండి విసురుతున్నది. తన ఇంట్లోవారికోసం ఇన్ని తిప్పలు పడుతూ చందనం చెక్కలా అరిగిపోతున్న జనిని తలచుకున్నకొద్దీ నామదేవుడి మనస్సు ఆర్ద్రమైంది. జనీ! నీ శ్రమ చూడలేకుండా ఉన్నానే. తిరగలి కాస్త ఆపి విశ్రాంతి తీసుకోవే అని బ్రతిమిలాడినా వింటేనా. సరే నీ శ్రమలో నన్ను కూడ కాస్త పాలుపంచుకోనీయవే అని, తానుకూడ తిరగలి విసరటానికి కూర్చున్నాడు నామ. జని, నామ పాడుతూ తిరగలి తిప్పుతున్నారు. తిరగలి చప్పుడుకూ, పాట సందడికీ రాజాయికి మెలకువ వచ్చింది. చూస్తే నామదేవుడి పడక ఖాళీగా ఉన్నది. ఈ అర్ధరాత్రి తన భర్తకు దాసీదానితో ఏమి పని? ఛీ! జని అలాంటిది కాదు. తన అక్కయ్యలాంటిది అని ఎంత అనుకుందామన్నా మనస్సు సమాధాన పడితేనా. లోపల ఉన్న స్త్రీ సహజమైన మాత్సర్యం, అనుమానం పడగలు విప్పి బుసలుకొట్టాయి. నామదేవుణ్ణి, జనిని తలచుకొన్న కొద్దీ కోపం, అసహ్యం పెరిపోయి అనుమానం పెనుభూతంలా పైశాచిక నృత్యం చేస్తున్నది. అస్పష్టంగా జని పాట వినపడీ వినపడనట్లుగా గాలిలో తేలి వస్తున్నది. రాజాయి ఇక ఉండలేకపోయింది. చప్పుడు కాకుండా పక్కమీద నుంచి లేచి అడుగులో అడుగు వేసుకుంటూ గది తలుపు చాటున రహస్యంగా నిలబడి లోపలికి తొంగి చూసింది.

లోపలి దృశ్యం చూడగానే రాజాయి కొయ్యబారి పోయింది. శరీరమంతా గగుర్పాటుతో జలదరించింది. ఉచ్ఛ్వాసనిశ్వాసాల వేగం అధికమౌతుంటే, గుండె దడ దడ కొట్టుకుంటుంటే మోకాళ్ళు వణికిపోతుంటే నిలబడలేక కుప్పగా కూలిపోయింది.

గదిలో సాక్షాత్తు పాండురంగడే జనితో గింజలు విసురుతున్నాడు. జని, నామదేవుడు ఇద్దరూ మౌన సమాధిలోకి వెళ్ళిపోయారు. కొన్ని క్షణాలు నిశ్శబ్దం రాజ్యం చేసిన తరువాత వారిద్దరిచుట్టూ బంగారురంగు కాంతివలయాలు ఏర్పడి వారిచుట్టూ గుండ్రంగా తిరుగుతూ నాట్యం చేయసాగాయి. ఇద్దరూ తిరగలిపిడి మీదనుంచి చేతులు తీసేసినా, తిరగలి దానంతటఅదే అఖండంగా అలా తిరుగుతూనే ఉన్నది.

కొద్ది క్షణాల నిర్వికల్పసమాధి తరువాత ముందు జని తననుతాను అదుపులోకి తెచ్చుకుంది. ఆమె వెంటనే వచ్చి రాజాయి తలను తన ఒడిలోకి తీసుకొని, చెదరిన ముంగురులను సవరిస్తూ, మృదు మధురంగా చెవిలో 'రాజాయి' అని పిలిచింది. అప్పటికి నామదేవుడు కూడ సమాధినుండి బయటకు జాగ్రదావస్థలోకి వచ్చాడు. జని సాయంతో రాజాయిని మెల్లగా లేవనెత్తి కూర్చోబెట్టాడు. రాజాయికి జరుగుతున్నదంతా లీలగా తెలుస్తూనే ఉన్నది. ఆమె పరవశంతో నామదేవుడివైపు కళ్ళార్పకుండా ఇంకా అలాగే చూస్తూఉండిపోయింది. నామదేవుడు కరుణ, ప్రేమ, జాలి ఉట్టిపడే స్వరంతో మృదువుగా'ఒసే రాజాయి! ఇంత తొందరగా ఎందుకు లేచావు? పగలంతా నీకు ఈ సంసార లంపటంతోనే గడచిపోతుంది. విశ్రాంతి తీసుకోమన్నా వినవు కదా. ఇంకాసేపు విశ్రాంతి తీసుకో' అన్నాడు. నామదేవుడి అనునయ వాక్యాలతో రాజాయికి బ్రహ్మానందం కలిగింది. మనస్సు ఏవేవో ఆనంద లోకాలలో విహరిస్తున్నది. ఆమెకు కనువిప్పు కలిగినట్లై ఇప్పుడిప్పుడే అంతా అర్థమౌతున్నది. పారవశ్యంతో విస్ఫారిత నేత్రాలతో నామదేవుడివైపు ఇంకా అలా తదేకంగా నిశితంగా, పరీక్షగా చూస్తూ ఉండిపోయింది.

జని ముగ్ధమోహనంగా నవ్వుతూ' ఏమిటి రాజాయి ఇలా సగం నిద్రలో లేచావు? పీడకల ఏమైనా వచ్చిందా?' అడిగింది. రాజాయికి అంతా అర్థం అయింది. ఆమె స్థిరంగా చెప్పింది'ఔనే జనీ! ఇప్పటి వరకు అంతా పీడకలే చూశాను. అదంతా పీడకల అని ఇప్పుడే మెలకువ రాగానే తెలిసింది. ఈనాడే కదా నాకు యథార్థం సాక్షాత్కరించి పూర్ణసత్యం గోచరించింది.' కళ్ళలోనుంచి పశ్చాత్తాపాశ్రువులు ధారలుగా వర్షిస్తుంటే రాజాయి నామదేవుడివైపు తిరిగి 'హే ప్రభూ! శ్రీ హరీ! నీభార్యనై ఉండీ నిన్ను గుర్తించలేకపోయాను. కేవలం నా పెనిమిటి అని చిన్నచూపు చూశాను'. మళ్ళీ జనివైపు తిరిగి 'జనీ! నీ భాగ్యమే భాగ్యమే! నీ అంతటి భాగ్యశాలివి నీవే. నీతో సాక్షాత్తుగా శ్రీహరే తిరగలి

తిప్పాడంటే నీ అదృష్టం ఏమని చెప్పను! నీ దాసీ పదవికి రాజ్ఞీపదవీ లభించింది. ఎవరు అన్నారోగాని అసూయ, అనుమానం ముందు పుట్టి ఆడది తరువాత పుట్టింది అని, నేను భార్యనైఉండీ ఛండాలురాలను, శ్రీహరిని దూషించి నానా దుర్భాషలాడాను. మెటికలు విరిచాను. తలచుకున్నకొద్దీ నామీద నాకే అసహ్యం వేస్తున్నది, రాజాయి గొంతు రుద్ధమైంది.

జని అనునయిస్తూ అన్నది'రాజాయి! ఇది నీవుకాదు చేసింది. నీలో ఉన్న గృహిణి నీచేత అలా చేయించింది. అంతరంగంలో ఈ రాజాయి ఎంత భక్తురాలో నాకు బాగా తెలుసు. ఈ రెండురూపాలను నేను ఎప్పుడో గుర్తించాను.'

'అక్కా! నీ అంతర్బాహ్య భావాలన్నీ ఆ రంగడిలోనే లీనమైనాయి. చల్లని గంధపుపూతలాగ, శీతలమలయపవనంలాగ అందరి ఆవేదనలను తీర్చే, లౌకికులకు అలౌకికాన్ని అనుగ్రహించే ఆ శ్రీహరే భర్తగా అనుగ్రహిస్తుంటే కూడ గుర్తుపట్టలేక పోయాను. భగవంతుడే వచ్చి ఎదురుగా నిలుచున్నా మనుజులు గుర్తించలేరన్నది ఎంత సత్యం! ప్రత్యక్ష పాండురంగడి భార్యనై ఉండీ ఏం లాభం? రుక్మిణిని కాలేకపోయాను. పిచ్చిముండ రాజాయిగానే మిగిలిపోయాను,' అంటూ తిరిగి నామదేవునివైపు చూసి 'నాథా! నన్ను క్షమించండి. మన మధ్య ఇంతకుముందు నేను కల్పించుకున్న భార్యాభర్తల సంబంధంకాక ఇప్పుడు నాలో కలిగిన సద్భావనయే నాలో కలకాలం నిలిచి పోయేలా చేయండి. ఆ భావనతోనే ఈయన నా నాథుడు అని నేను సగర్వంగా చెప్పుకుంటాను.' రాజాయి నిండుమనసుతో హృదయపు లోతులలోనుండి చెప్పింది.

నామదేవుడు రాజాయివైపు గంభీరంగా, ఆదరంగా చూశాడు. జని రాజాయి బుగ్గలపైన జారిన కన్నీళ్ళను తుడిచి అరచేతులతో మృదువుగా నిమురుతూ 'రాజాయి! నీవు ఇప్పుడు ఆ స్వామికి అన్ని విధాలుగా రుక్మిణివి అయినావు. అలాగే ఆ స్వామి వామభాగాన రుక్మిణిగా నిలచిపో. నేను మీ ఇద్దరికీ దాసిని. ఈ జనికి దాస్యంలోనే పూర్ణత్వం లభించింది.' వారిద్దరికి తన నయన జ్యోతులతోనే హారతి ఇచ్చి జని మళ్ళీ తిరగలి దగ్గరకు వెళ్ళి కూర్చున్నది. జని తిరగలి తిప్పుతుంటే జని చేతులకు ఉన్న గాజుల చప్పుడు సన్నగా లయబద్ధంగా మధురమంజులంగా వినిపిస్తున్నది.

- సశేషం

# గురుకృప

-శివ ప్రసాద్

"శ్రీకృష్ణ భగవానుడికే శాపం ఇవ్వబోయాడని అన్నారే, భార్గవుడైన ఆ ఉదంకుడు, అతడు అంతటి ప్రభావశాలి ఎలా కాగలిగాడు?'' జనమేజయ మహారాజు వైశంపాయన మహర్షిని అడిగాడు. వైశంపాయన మహర్షి చెప్పటం ప్రారంభించాడు.

జనమేజయ మహారాజా! గురుకృపతో సాధించలేనిది ఏమున్నది? గురుకృప కలిగినవానికి లోటేముంటుంది? గురువు అనుగ్రహిస్తే సకల దేవతలు అనుగ్రహిస్తారు. త్రిమూర్తులకు కోపం వచ్చినా గురుదేవుడు రక్షిస్తాడు. కాని గురుదేవుడికి కోపం వస్తే త్రిమూర్తులు కూడా రక్షించలేరు. ఉదంకుడు బహుకాలం అత్యంత శ్రద్ధతో, నిష్ఠతో గురుశుశ్రూష, అగ్న్యుపాసన చేసి గురుకృపకు సంపూర్ణంగా పాత్రుడైనవాడు. అందువలననే ఆ భార్గవుడు అంతటి ప్రభావశాలి కాగలిగాడు. అతని చరిత్ర సావధానుడవై విను.

గౌతమాశ్రమంలో ఎందరో శిష్యులు అధ్యయనం చేస్తూ ఉండేవారు. వారిలో భార్గవుడైన ఉదంకుడు ఒకడు. గౌతముడు విద్యాభ్యాసం పూర్తికాగానే శిష్యులను ఒక్కొక్కరినే ఆశీర్వదించి వారికి వరాలిచ్చి ఇంటికి పంపేస్తున్నాడు. ఎన్నో ఏళ్ళు గడిచిపోయాయి. కాని ఎందుకో ఆయన ఉదంకుడి సంగతి పట్టించుకోలేదు. ఉదంకుడుకూడ దీనిని పట్టించుకోలేదు. తిరిగిపోతున్న కాలచక్రం గురించిన స్పృహకూడ లేకుండా అత్యంత వినయ భయభక్తులతో గురుశుశ్రూష చేసుకుంటూ ఆశ్రమంలోనే ఉండిపోయాడు.

ఒకనాడు ఉదంకుడు అడవినుంచి ఒక పెద్ద కట్టెలమోపు నెత్తిమీద పెట్టకుని తెచ్చాడు. అందులో జడలుకట్టిన తన వెంట్రుకలలో ఒక జట ఇరుక్కుని పోయింది అన్నసంగతి అతనికి తెలియలేదు. నెత్తిమీదనుంచి కట్టెల మోపు క్రింద పడవేసినప్పుడు తన శిరోజాలలోని ఒక జట ఊడి అందులో ఇరుక్కుని ఉండటం గమనించాడు. వార్ధక్యంతో తెల్లగా నెరిసిపోయిన ఆ జడను చూడగానే ఉదంకుడికి తన శరీరపాటవం సంగతి తెలిసివచ్చింది. తాను వృద్ధుడైనాడు. తలకూడ నెరిసిపోయింది. ఎందరో శిష్యులు విద్యాభ్యాసం ముగించుకొని గురుదేవుల ఆశీస్సులనుపొంది తమతమ గృహాలకు తిరిగి వెళ్ళిపోయారు. అయినా ఇంతవరకూ తాను శ్రీగురుదేవుల అనుగ్రహానికి పాత్రుడు కాలేకపోయాడు. ఆ ఊహరాగానే అతడికి పెద్దపెట్టున ఏడ్పు వచ్చింది. అతని కళ్ళనుండి అశ్రువులు బొటబొటా కారాయి.

గౌతముడు వెంటనే తన కూతురిని ఆ కన్నీళ్ళు భూమిమీద పడకుండా తన దోసిలిలో పట్టుకోమని ఆజ్ఞాపించాడు. ఆమె వెంటనే తన దోసిలి పట్టింది. కాని ఆ కన్నీళ్ళ వేడిని భరించలేక వాటిని భూమిపై జారవిడిచింది. ఆ కన్నీళ్ళు పడినంతమేర భూమికూడ ఆ వేడిని సహించలేక తల్లడిల్లిపోయింది. అప్పుడు గౌతముడు ఉదంకుడిని దగ్గరకు పిలచి కరుణ ఉట్టిపడుతున్న స్వరంతో అతనిని ఓదారుస్తూ...........

**గౌత** - వత్సా! ఏడుస్తున్నావు ఎందుకు?

**ఉదం** - గురుదేవా! నేను తమవద్దచేరి ఎంతోకాలం గడిచిపోయింది. ఎందరెందరో శిష్యులు మీవద్ద తమ విద్యాభ్యాసం పూర్తిచేసుకుని మీ ఆశీస్సులు పొంది వెళ్ళిపోయారు. నా వయఃపాకంకూడా ముదిరిపోయింది. ముదిమి వచ్చింది. జడలుకూడా తెల్లబడ్డాయి. అయినా నా దురదృష్టం ఏమోకాని నేను మీ కృపాకటాక్షానికి ఇంతవరకూ పాత్రుడను కాలేకపోయాను. అది తలచుకుంటే నాకు దుఃఖంరాక ఎలా ఉండగలదు?

**గౌత** - నాయనా! నీ తపస్సు శ్లాఘనీయము. నీవు అకళంక చరితుడవు. నీ ఏకనిష్ఠ గురుభక్తి అనితరసాధ్యము. నీ గురూపాసన, అగ్న్యుపాసన, శ్రద్ధ, నిష్ఠ, అన్నీ నన్ను ముగ్ధుణ్ణి చేశాయి. తపోస్ఫీతుడవైన నీ ఓజస్సును, తేజస్సును ఈ మా తనయ తక్క ఇతర కన్యలు భరించలేరు. నేను నీకు యౌవనాన్ని ప్రసాదిస్తున్నాను. నీవు వృద్ధాప్యాన్నివీడి దానిని స్వీకరించు. ఈ మా తనయను నీ భార్యగా స్వీకరించు. నీకు గురుపుత్రిక అన్న భావం పోవటానికి ఈ ఎలనాగకు ఈ శరీరం బదులు వేరే శరీరాన్ని ప్రసాదిస్తున్నాను. ఎలప్రాయాన్ని పొంది, నూతనదేహం పొందిన ఈ కన్యను పరిగ్రహించి చక్కగా గృహస్థాశ్రమం స్వీకరించు. ఇది అధర్మం కాకుండా నేను వరమిస్తున్నాను.

ఉదంకుడు యౌవనుడైనాడు. గౌతమ తనయకూడా నూత్న శరీరంతో అనన్యసౌందర్య రాశిగా అయి ఉదంకుడికి అనురూపవతిగా అయింది. ఉదంకుడు ఆ కన్యను స్వీకరించి...........

**ఉదం** - గురుదేవా! ఇప్పుడు నాకు మీరు గురుదక్షిణను సమర్పించుకొనే అవకాశాన్ని ప్రసాదించండి. మీ అభీష్టం ఏదో తెలిపితే, మీ కృపవలన దానిని సాధించి మీ పాదపద్మములవద్ద సమర్పించుకుంటాను.

**గౌత** - (పరమప్రీతుడై) నాయనా! గురుదక్షిణ ఇతరులవిషయంలో మాత్రమే. కాని నీ విషయం వేరు. నీవింతకాలం ఏకనిష్ఠభక్తితో ఆచరించిన గురుసేవకు

ఏ గురుదక్షిణ కూడా సాటిరాదు. నేను నీ గురుసేవాతత్పరతకు పరమ సంప్రీతుడనైనాను. ఇక వేరే గురుదక్షిణమాట తలపెట్టకు.

ఉదంకుడికి గురుదేవుల కరుణామృత వాక్కులు సంతోషం కలిగించినా, సంతృప్తిని కలిగించలేదు. ఏదో విధంగా గురుదక్షిణ సమర్పించి గురుఋణంనుండి విముక్తుడు కావాలి అని అతని తపన. అందుకే అతడు గురుపత్నియైన అహల్య వద్దకు వెళ్ళి...........

**ఉదం** - నేను గురుదక్షిణ సమర్పించుకోవాల్సిన సమయం ఆసన్నమైనది. గురుదేవుల వాక్కులు విన్నారు కదా! అయినా మీ అభీష్టవస్తువు తెలిపితే, గురుకృపతో దానిని సాధించి తమకు సమర్పించుకుంటాను. అప్పుడుకాని నాకు తృప్తిగా ఉండదు.

**అహ** - నాయనా అలా అయితే మిత్రసహుని భార్య మదయంతి ధరించే కుండలాలు తెచ్చిపెట్టు. నేటికి నాల్గవనాడు నేను వ్రతం చేసుకోవాలి. ఆ కుండలాలు ధరించికాని ఆ వ్రతం చేసుకోవటానికి లేదు.

**ఉదం** - అమ్మా గురుకృపాకటాక్షంతో నీ కోరిక తప్పక నెరవేరుతుంది. ఇక నాకు సెలవిప్పిస్తే గురుకార్యార్థం వెళ్ళివస్తాను.

**అహ** - క్షేమంగా వెళ్ళి లాభంగా తిరిగిరా తండ్రీ! గురుకార్యార్థివైన నిన్ను సద్గురుదేవుల కటాక్షవీక్షణం, వారికృప సర్వదా రక్షిస్తూ ఉంటాయి. గౌతమ మహర్షుల కృపకు పాత్రుడవైన నీవంటి సచ్ఛిష్యుణ్ణి ఏమైనా అనటానికికాని, అటువంటి శిష్యుడికి ఏదైనా కీడు తలపెట్టటానికి కాని ఎవరు సాహసించగలరు.గురుకార్యం సాధించి సమయందాటిపోయేలోపలే తిరిగిరా. విజయోస్తు!

గురుపత్ని అహల్య ఆశీస్సులుపొంది ఉదంకుడు కుండలాలు తేవటానికి వెంటనే వెళ్ళిపోయాడు. కొంతసేపటికి అక్కడకు వచ్చిన గౌతమ మహర్షి ఉదంకుడు కనబడటంలేదు అని గుర్తించి....

**గౌత** - దేవీ! ఉదంకుడు ఎక్కడ?

**అహ** - ఉదంకుడు గురుదక్షిణ సమర్పించుకోవటానికి అనుమతి నీయమని ప్రార్థించాడు. నేటికి నాల్గవరోజున నేనొక వ్రతం తలపెట్టాను. దానికొరకు మిత్రసహుని భార్య పరమపతివ్రత అయిన మదయంతి కుండలాలను తెచ్చిపెట్టమని అడిగాను. అతడు గురుకార్యార్థియై మిత్రసహుని వద్దకు వెళ్ళాడు.

-సశేషం

# శ్రీకృష్ణ కర్ణామృతం

- సుశీలా ప్రసాద

**శ్లో॥ బర్హోత్తంస విలాసి కుంతలభరం మాధుర్య మగ్నాననం**
**ప్రోన్మీలన్నవయౌవనం ప్రవిలసద్వేణు ప్రణాదామృతమ్।**
**ఆపీనస్తన కుట్మలాభిరభితో గోపీభిరారాధితం**
**జ్యోతి శ్చేతసి న శ్చకాస్తి జగతామేకాభిరామాద్భుతమ్॥**

లేమావిడి క్రొన్ననలనుతింటున్న కోయిలమ్మకు అమృతమయమైన మధుర మురళీనాదం వినబడగానే ఆ లేతమామిడి చిగురు, వగరుగా, వెగటుగా అనిపించింది. తినటం ఆపి చిరుగాలి తరగలపై మందమందంగా తేలివస్తున్న ఆ తీయనిపాట వినటం మొదలెట్టింది. ఇంతదాకా లోకం తన కంఠమాధుర్యాన్ని మెచ్చుకోవటమే తెలుసుగాని ఇంత మైమరపించి, ఆనందడోలికలలో ఊగించే, అద్భుతమైన గానం ఉందని తనకి తెలియదు. ఎవరిదావేణుగీతి? కొమ్మమీంచి కొమ్మమీదకి ఎగురుతూ వెదికి చూచించి. నాలుగు చెట్ల అవతల ఒక పొన్నచెట్టు నీడలో ఒక మూర్తి పొడగట్టింది దానికి. తన ఊహ నిజమైతే... అనుకుంటూ, రివ్వున ఎగిరివెళ్ళి, వానిచెంత వాలింది. నీలిరంగు మేనిచాయతో, నల్లని మెరిసే జుట్టుతో, నుదుట కస్తూరి బొట్టుతో ఉన్న ఆ చిన్నిబాలుని మృదువైన చేతిలో మురళి వాని ఎఱ్ఱని పెదవులని స్పృశిస్తూ, అతగాడు పలికించే ప్రతి స్వరాన్ని, ప్రకృతిలోని అణువణువులో నింపుతున్నది. ఒళ్ళంతా కళ్ళుచేసుకుని, వానినే చూసింది, కోయిలమ్మ. తనలాగే నల్లగా ఉన్న ఆ మూర్తి పిల్లనగ్రోవి పాటతో శృతికలిపి పాడాలనిపించింది. గొంతువిప్పి ప్రయత్నించింది. పట్టుదలతో తనసాధన సార్థకం కావాలని మరీ మరీ యత్నించే కోయిలమ్మను, అరమోడ్చిన తన కలువ కన్నులను విప్పి చూశాడు, మురళీలోలుడు. ఆప్యాయంగా కోయిలమ్మను దగ్గిరకు తీసుకుని దాని వీపు నిమురుతూ "సాధించావే మొత్తానికి" అన్నాడు. వాని స్పర్శతో, తీయనివాక్కులతో,ఆనంద పరవశమై పోయిన కోయిలమ్మ నాటితో తనపుట్టుక సార్థకమైందనుకొంది.

దూరాన తిరుగాడుతున్న ఒక నెమలి దూరంనించే శ్యామసుందరుని చూసి కారుమొయిలు అనుకుని ఆనందంతో పురివిప్పి నాట్యం చేయసాగింది. పరవశంతో ఆడిఆడి అలసిపోయిన నెమలి, ఆట ఆపి నెమ్మదిగా నడుస్తూ, ఆ నీలమేఘశ్యాముని చెంతకు చేరింది. తన కంఠంవలె నీలవర్ణంతో మెరిసి పోతున్న ఆ మనోహర రూపాన్ని తనివితీరా చూస్తూన్న దాని దృష్టి కోయిలమ్మపై పడింది.

అదెంత భాగ్యశాలి! తను కూడా అలాగ పొడగలిగితే?తానూ వాని దయను అలా పొందగలిగితే ఎంతబాగుండు అనుకొంది. నెమలి ఆశగా నోరు తెరిచింది. తనకేక తనకే అదోలా అనిపించింది. నెమలికి దుఃఖం వచ్చింది. తన దురదృష్టాన్ని నిందించుకుంటూ కళ్ళవెంట నీళ్ళుకారుస్తూ, దీనంగా తదేకంగా తననే చూస్తున్న నెమలిని, అప్పుడు గమనించాడు గోపాలదేవుడు. మురిపెంగా చూస్తూ, మంద హాసం చేస్తూ "ఇలాగ నా దగ్గిరగా రా! నీ ఫించం ఎంత సుందరంగా ఉంది! మా అమ్మ నా సిగముడిలో అలంకరించిన మరకతమణుల, నీలాల సరాల జిలుగు వెలుగులకన్నా నీఫించంలోని వన్నెలు ఎంత బాగున్నాయో! నీ ఈక ఒకటి నాకియ్యవా! నా సిగముడిలో అలంకరించుకుంటాను,'' అన్నాడు. సంతోషంతో నెమలికి ఒళ్ళు తెలియ లేదు. నోటమాట రాలేదు. స్వామిని సమీపించి, వాని పాదాలచెంత పురివిప్పింది. ఒక చేతితో కోయిలమ్మను అక్కున చేర్చుకుని ఉన్న గోపబాలుడు రెండవ చేతిలోని మురళిని క్రిందపెట్టి చెట్టునించి పువ్వును కోసినంత మృదువుగా, భద్రంగా నెమలిఫించంలోని ఒక ఈకను తీసి తన సిగముడిలో ఉంచుకున్నాడు. ఆ ఈక బాలుని శిరోభూషణమై మరింత ప్రకాశించింది. నా జన్మ ధన్యమైంది అనుకుంది నెమలి, స్వామిపాదాలకి ప్రణమిల్లుతూ.

అప్పటిదాకా, అంతా వేడుకగా చూస్తున్న వేణువు "ఏమి నీ లీల ప్రభూ! ఈ లోకంలోని ప్రేమలన్నీ స్వార్థపూరితాలే, అస్థిరములైనవే. కాని దాసుల యెడ నీ దయ ఆశ్రితుల పట్ల నీ వాత్సల్యం సాటిలేనివి, సుస్థిరమైనవి. హెచ్చుతగ్గులు చూపని సమవర్తివి స్వామీ నువ్వు'' అన్నది మహదానందంగా. "సత్యాన్ని తెలుసు కున్నావు వంశీ! దేహధారి అయిన జీవునికి తన ప్రతి అంగమూ ఎంత ప్రియం అయినదో అదే విధంగా నా రూపమే అయిన ఈ సృష్టిలోని ప్రతి అణువూ నా ప్రేమకు పాత్రమైనదే'' అన్నాడు ఆ విశ్వరూపుడు. ఏమీ చదువుకోలేదు గోపికలు. అయితేనేం, జగన్నాథుడైన లీలాకిశోరుని తత్త్వాన్ని గ్రహించగలిగిన జ్ఞానులైనారు వారు. పూర్వ జన్మలో తాముచేసిన తపస్సులు ఫలించిన మహర్షులు కదా! తమ ఉపాధులన్నీ స్వామి శరీరమే అన్న ఆరూఢమైన విశ్వాసంతో ఉన్నవారు వారు.

అప్పుడే ఉదయిస్తున్న సూర్యకిరణాల వలె, గోపాలదేవుని యౌవన రేఖలు కాంతులు వెదజల్లుతుంటే, సకలేంద్రియ సమర్పణ చేసిన ఆ గోపికలు నిండుమనస్సులతో స్వామిని సేవిస్తున్నారు. పొంగిన భక్తిజ్ఞానాలనే వారి స్తనద్వయాన్ని పరిమళ భరితాలైన పూలమొగ్గలవలె అర్పిస్తూ స్వామిని అర్చిస్తున్నారు. తనకన్న అన్యమైనదేదీ లేని ఏకాభిరాముడైన అట్టి పరమ పురుషుని అద్భుతమైన దివ్య తేజస్సు మా మస్సునందు వెలుగుతున్నది. *

# మౌనధ్యాన సప్తాహశిబిరం

-రమణ ప్రసాద్

## గురుదేవా జయదేవా శరణు శరణు సద్గురుదేవా

ఉత్తానపాదమహారాజు పెద్దభార్య కొడుకు ధృవుడు. అతని తల్లి అతనికి మార్గదర్శి అయింది. పెద్దవాళ్ళు ఏది చేసి చూపిస్తే చిన్నవాళ్ళు అదే నేర్చుకొంటారు. నువ్వు పూజలో కూర్చొంటే పిల్లవాడుకూడా వచ్చి కూర్చుంటాడు. దేవునికి నైవేద్యం పెట్టిన ప్రసాదం ఇస్తే తింటాడు. పెద్దవాళ్ళు పువ్వులు వేస్తే చిన్నపిల్లకూడా మొన్న జరిగిన సద్గురు పాదపూజలో గుప్పెటతో పువ్వులు వేసింది. ధృవుని తల్లి శ్రీమన్నారాయణ స్మరణ చేసేది. తదనుగుణంగా ధృవునికి నేర్పింది. అది ఎప్పుడు ఉపయోగపడింది!

ధృవుడు గబగబా వెళ్ళి తండ్రి తొడమీద కూర్చోబోతాడు. రెండవభార్య కొడుకు రెండవతొడమీద కూర్చున్నా ఆమె వచ్చి "నీకంత స్థానం కూడానా! నీస్థానం ఇక్కడ కాదు ఫో" అని నెట్టివేస్తుంది. ధృవుడు తల్లి దగ్గరకు ఏడుస్తూ వస్తాడు. తల్లి ఓదార్చినా ఊరటచెందలేదు. అప్పుడామె "నాన్న కన్నా నాన్న శ్రీమన్నారాయణుడు, ఆయన గురించి తపస్సుచేసి ఆయన సాక్షాత్కారం పొందు" అని చెప్పగానే ఇల్లు విడిచి అడవికికెళతాడు. ధృవుడు అడవికి చేరగానే నారదుడు పరీక్ష చేయటానికి వచ్చాడు, "ఎందుకయ్యా! అడవిలో ఒక్కడివీ తిరుగుతున్నావు? అని నారదుడు అడిగితే

**ధృ** - నేను శ్రీమన్నారాయణుని కోసం తపస్సు చేయాలి.

**నార** - నువ్వు పసివాడవు. నారాయణమూర్తికోసం తపస్సు చేస్తావా? అది సామాన్యమా? అసలు నీకు తపస్సు ఎలా చేయాలో తెలుసా?

తల్లి చెప్పిన గుర్తుబట్టి ధృవుడు నారదుని గుర్తిస్తాడు, కాని వెంటనే ఆయనకు తాను నమస్కరిస్తే ఆయన "వెంటనే తిరిగి వెళ్ళు" అంటే, ఏం చేయాలో తోచలేదు. ధృవుడు నారదునితో -

**ధృ -** ఐతే దానికి తరుణోపాయం చెప్పండి.

**నార** - నీ తండ్రి తొడమీద నీకు స్థానం ఇప్పిస్తాను.

**ధృ** - వద్దు.

**నార** - నీకు అష్టైశ్వర్యాలు కలిగి నువ్వురాజు అయ్యేట్లు చేస్తాను.

**ధృ** - వద్దు.

చివరికి ధృవునికి 'ఓం నమో భగవతే వాసుదేవాయ'' అనే ద్వాదశాక్షరీ మంత్రాన్ని ఉపదేశించాడు.

ధృవుడు తదేకదృష్టితో తపస్సు ప్రారంభించాడు. పట్టువీడలేదు. పుట్టలు లేచాయి, పాములు వచ్చాయి. పట్టుదల, తెలిసికోవాలనే ఆవేదన అలా ఉండాలి. నువ్వు సరిగ్గా చేయలేకపోవటానికి కారణం పట్టుదల లేకపోవటమే.

ఇక్కడ సమర్థుడైన గురుదేవుడు నారదుడు, నారాయణమూర్తిని ప్రత్యక్షం చేసుకోవాలి అనే నిష్ఠతో వచ్చిన శిష్యుడు ధృవుడు. శ్రీమన్నారాయణుని సాక్షాత్కారం అయ్యేవరకు పట్టువీడలేదు. **'సన్యసస్య శ్రవణం కుర్యాత్'** అన్నారు.

మూడు కాలాలను జయించి తపస్సు చేశాడు. నారాయణమూర్తికి దర్శనం ఇవ్వక తప్పలేదు. మనకి తల్లి తండ్రి జన్మని ఇచ్చారు. ఎన్నో విషయాలు నేర్పారు. అవి ప్రాపంచికమైనవి. టి.వి. ఎలా ఆన్ చేయాలి? ఫ్యాను ఎలా వేయాలి? ఐస్‌ఫ్రూట్ ఎలా తినాలి మొదలైనవి నేర్పారు.

కట్టెలాంటి దేహంలో ఏది ఉందో చెప్పండి? తెలియదు. అందుకని ఒక మహాత్ముని ఆశ్రయించాం. ఆయన మనని నిరుత్సాహ పరచలేదు. ఆయన దానిలో లాభం ఏమిటో, నష్టం ఏమిటో తెలియజేశారు. కోట్లు ఖర్చుపెట్టి ఇల్లు కట్టావు. కాని వాస్తు సరిగ్గాలేకపోతే ఉపయోగం ఏమిటి? కాబట్టి ఇల్లు మనకి ఒకటి ఉన్నది. ఒకస్థానంలో ఉన్నాం. అది ప్రస్థానం అంటే ప్రకృష్టమైనస్థానం. అది ప్రసాదించేది గురుదేవుడు మాత్రమే. అది ఏది అంటే - నిన్ను నువ్వు గుర్తించే తత్త్వమే. ఆతత్త్వం మనకుగా మనం తెలుసుకోలేం. చెప్తే తెలుసుకోలేం. ఐతే మామూలు విషయాలు మనం తేలికగానే తెలుసుకుంటాం. కోర్టుకి వెళ్ళితే చొక్కాగుండీలు తీయకూడదు. కాలుమీద కాలువేసుకోకూడదు,సెల్యూట్ ఎలా చేయాలో తెలుసుకొంటాం. దానికి మనమేగా జడ్జీలం. అక్కడి పద్ధతిప్రకారం చేయాల్సింది చేస్తున్నామాలేదా?

మరి గురుదేవుల సన్నిధిలో ఇంకా ఎంత మరింత వినయవిధేయతలతో ఉంటూ సాధన చేయాలి? 'నువ్వు ఆనందంగా ఉంటే నాకు ఆనందం రా' ఎంత సమర్థించి చెప్పారండి. నీ ఖర్మ నువ్వు ఎలాపోతే నాకేమిటి

అన్నారనుకోండి, మనం ఏమవుతాం? కాని వారు అలా అనేవారుకాదు.

ప్రహ్లాదుడు నారాయణుని వెతుక్కుంటూనే పుట్టాడు. పరీక్షిత్తు పరీక్షిస్తూనే పుట్టాడు. రూపనామక్రియారహితమైన వస్తువు ఉంది అని బోధచేస్తున్నారు గురుదేవులు. వారిని కూడా అదే బృందావనంలో ఒక రూపంగా చూస్తున్నావు. ధ్యానంలో మనస్సు నిలవకపోతే బాబూ! అనుకోవూ. ఇప్పుడు నేనుపాడిన గురుదేవా జయదేవా అనే పాట గురుదేవులకు ఇష్టమైన పాట.

నిజంగా మనం అటువంటి స్థితిలో ఉన్నామా లేదా? ఉంటే అది ధ్యానమే. 'చెడు వదిలిపెట్టు. మంచిని ఆశ్రయించు' అని చెప్పారు. మంచివైపుకు వెళ్ళాలంటే చెడు వాసనలను రహితం చేసుకోవాల్సిందే. అందుకే గురుదేవులను శరణువేడాలి.మనకి ఎంత కావాలో అంత పెడతాడు.

కార్తీక మాసంలో బహుళ దశమినాడు వారి అవతారం సమాప్తి అయ్యేముందు డాక్టర్లు వారిని చూడటానికి వచ్చేవారు. చెట్టున కోసిన అరటికాయలతో కూర, నల్లపచ్చడి మజ్జిగ చేయించారు. సాయంత్రం 6గం.లకు భోజనం. సాధారణంగా భోజనాలలో అన్నంమాత్రం తిన్నంత పెట్టి, ఆధరువు టీస్పూన్‌తో వడ్డిస్తారు, కాని బాబూజీ మహరాజ్ - అన్నం అంత ఆధరువుతో వారే స్వయంగా కూర బక్కెట్ పట్టుకొని అందరికీ వడ్డిస్తూ తనను చూడటానికి వచ్చిన డాక్టర్లతో సుష్టుగా తినిపించేవారు. జీవితానికి పరమాత్మ ఆధారం."అందుకనే నీకు శరణుపొందుతున్నాం అయ్యా! నీపాదాలపై పడ్డాం" అంటాం. ప్రహ్లాదుడు కొండమీద నుంచి త్రోసివేస్తే నారాయణుడున్నాడు అని నమ్మాడు కనుక ఆయన జడవలేదు. మనం జడుస్తాం. కాని ఆయనే మనని పట్టుకొని ఉన్నారు.మనకట్టి నిదర్శనాలున్నాయి కదా! అది చాలు. దానిమీద ధ్యాననిష్ఠ కుదిరితే చాలు.

**ఎవ్వని చే జనించు జగమెవ్వని లోపలనుండు లీనమై**
**ఎవ్వని యందు డిందు పరమేశ్వరుడెవ్వడు మూలకారణం**
**బెవ్వడనాది మధ్య లయుడెవ్వడు సర్వముతానయైన వా**
**డెవ్వడు వాని నాత్మభవునీశ్వరునే శరణంబువేడెదన్**

( భాగవతం -గజేంద్ర మోక్షం)

-సశేషం

# మాతాజీ బోధామృతం

(గతసంచిక తరువాయి) - శివ ప్రసాద్

ఏదైనా మనకు సుఖం కలిగించేది మనకు కావాలి అంటే ముందు మనందానికి సేవ చేయాలి. ఇప్పుడు ఈ మైక్ మనకు సేవ చేస్తున్నది అంటే ముందు మనం దానిని బయటకు తీసి ఇక్కడ స్టాండ్‌కు బిగించి ఎంత సేవచేస్తే అది ఇప్పుడు మనకు సేవ చేస్తున్నది? అలాగే తలక్రింద మంచి దిండు ఉంటే బాగా నిద్రపడుతుంది అనుకుంటే, ముందు దాన్ని మోసుకొని తెచ్చి తలక్రింద పెట్టుకోవటం అనే సేవ చెయ్యాలి. ఒకాయన గురుదేవులను చూడటానికి వస్తూ ఒక సంచీని తీసికొని వచ్చారు. అందులో ఒక తుండుగుడ్డ తెచ్చుకున్నారు. ముందు అలా తుండుగుడ్డను మోసుకొచ్చు కుంటేనే కద, తరువాత అది ఉపయోగ పడుతుంది. అలాగే మనం ఈ దేహానికి సేవచేస్తున్నాము. అది నిన్ను సుఖపెడుతున్నాను అంటున్నది కాని సుఖం ఒక్కటే కలిగిస్తున్నదా? అంతకు అంత దుఃఖం కూడ కలిగిస్తున్నది.

మొన్న శ్రీ గురుషడ్ధామ యాత్రలో, కేదార్‌నాథ్ దగ్గర హెలికాప్టర్‌లో ప్రయాణించే అవకాశం కొందరు భక్తులకు దొరికింది. అంతకు ముందు వైష్ణోదేవి దేవాలయానికి కూడ ఆ సౌకర్యం ఉన్నది కాని, అక్కడ ఆ అవకాశం దొరకలేదు. అంతా సీరియస్‌గా ఉంటే ఎలా? కాసేపు నవ్విస్తాను.

మీకు గుర్తుందో లేదో మహబూబాబాద్ నుండి శ్రీబాబూజీ దగ్గరకు కొందరు శిష్యులు వస్తుండేవారు. శ్రీగురుదేవులు వారితో, నేను వెనకనే వస్తాను, ఇదిగో మా శిష్యులు వస్తున్నారు, వారిని తీసికొని వెళ్ళండి అనేవారు. వారు మమ్మల్ని తీసికొని వెళ్ళేవారు. అక్కడ ఒక సమావేశం అయ్యేది. మాకు వాళ్ళ భాష వింతగా ఉండి సరిగ్గా అర్థం అయ్యేదికాదు. వాళ్ళు అక్కడి వాళ్ళతో చెప్పేవారు, గిదిగో నేనుపోతినా, గాడ బాబుగారు కలిసిండు. బాబుగారు వీళ్ళందర్ని ముందస్తుగ తోల్కొపొమ్మని చెప్పిండు. గందుకని వీళ్ళను గిప్పుడే తోల్కొదెచ్చినా.' మాకు తోల్కొరావటమేమిటి? అనిపించింది. తరువాత తెలిసింది తోల్కొని రావటం అంటే తీసికొనిరావటం అని.

మహబూబాబాద్ సత్సంగాలు బాగా జరిగాయి. అక్కడే మొదట 'చరణములే నీ చరణములే, చరణములే ప్రభుచరణములే' అనేపాట

ప్రసాదించారు. ఆ పాట అప్పుడు పుట్టింది. నిజంగా మనస్సుపెట్టి పాడుకుంటే, అందులోనుంచి బయటకు రావటం కష్టం. ఆ చరణాలలోనే ఈ చలించే జగత్తు అంతా ఉన్నది. ఈ జగత్తు చలించినట్లు కనిపిస్తున్నా, వాస్తవానికి దానికి ఆధారమైనది చలించనిది అన్న స్ఫురణ ఎవరికి కలుగుతుందో వారికి సద్గురుదేవుల చరణం చలించేది కాదు అన్న స్ఫురణ కలుగుతుంది. సరే వాళ్ళు మాకు భోజనాలు పెట్టేవారు. మేమంటేమేమని వాళ్ళు మమ్మల్ని ఒక ఇంటినుంచి ఇంకొక ఇంటికి తోలుకెళ్ళేవారు. ఒక శిష్యుడు మమ్మల్ని వాళ్ళింటికి భోజనాలకు తోలుకెళ్ళాడు. గురువుగారు (అంటే ఆమ్మ) కూడ మాతో ఉన్నారు.

గురుపూజలో భోజనాలు పెట్టించేటప్పుడు శ్రీగురుదేవులు 'ఏం! ఇంకా నిలబడే ఉన్నారేం? ముందు వెళ్ళి ప్రసాదం తీసుకోండి' అని చెప్పేవారు, మనం వాళ్ళకు ఎక్కడ ఇబ్బంది కలిగిస్తామో అని, అలాగే తన బిడ్డలకు ఎక్కడా ఏదీ తక్కువ కాకూడదు అని. నేను వెనకాల ఉంటాను అంటే, వెనక ఉంటే నీవు వెనక బడిపోతావు, ముందే ఉండు, ముందుకు సాగు అని హెచ్చరించేవారు.

వెనక ఉండి నడిపించే అనంత శక్తి ఒక్కటే. అదే మనల్ని ముందుకు నడిపిస్తోంది. దానిని మనం గుర్తించాలి.

సరే భోజనానికి కూర్చున్న తర్వాత ముందు స్వీట్లు వడ్డించిన్రు. మనకైతే అన్నం రావాలె, నెయ్యిరావాలె, గప్పుడుగాని నీళ్ళు చుట్టూ తిప్పి తినటం షురు చెయ్యం. రొట్టెలు వస్తున్నె, స్వీట్లు వస్తున్నె, గింకా అహం వైశ్వానరో భూత్వారావటం లేదు. గమ్మ (గంటే గురువుగారు) గింకా పచ్చజండా ఊపలేదు. గందరం అన్నంకోసం చూస్తూ ఉన్నాము. గీలోపలే గక్కడివాళ్ళు వేసినవి వేసినట్లు తినేస్తున్నారు. అరగంట తరువాత చెప్పారు, గిక్కడ అన్నం ఉండదు రొట్టెలు, కూరలే ఉంటై అని. గప్పుడు తిన్నాము. తరువాత ఆలస్యంగా వెళ్ళిన మమ్మల్ని చూసి గురుదేవులు అన్నారు 'ఏమిటీ! ఇంతసేపు అన్నం తింటూ కూర్చున్నారు?' అని. మేము జరిగింది చెప్పాము. ఏదో పెట్టింది తిని వచ్చేయక, ఇదంతా ఏమిటి? అన్నారు.

-సశేషం

# మాతాజీ సత్సంగ్ డైరీ

-శివ ప్రసాద్

(గత సంచిక తరువాయి)

(ఏప్రిల్17నుండి19 వరకు విజయవాడలోజరిగిన సత్సంగ కార్యక్రమాలలో 18వతేదీన బ్రాహ్మీ ముహూర్తంలో శ్రీ మాతాజీ వారు చేసిన **ప్రబోధమును** సంగ్రహంగా ఇక్కడ ప్రచురిస్తున్నాము - ఎడిటర్)

నిన్నటి ప్రబోధం తరువాత మనందరికి కొంచెం నిత్యానిత్య వివేకదృష్టి కలిగింది. చాలమంది ఉదయం 4గం.లకు వచ్చారు. ప్రతిదానిలో మనం వివేకదృష్టితో చూడటం నేర్చుకోవాలి. మనం చేసికొనే కార్యక్రమాలలో వివేక దృష్టిని కలిగి ఉండాలి. మనం కుండలో నీరు చల్లగా, మధురంగా ఉంటుందని, ఆరోగ్యానికి మంచిదని కుండలో నీళ్ళు త్రాగుతాము. ఫ్రిజ్‌లో నీళ్ళు త్రాగము. లక్షలు పోసికొన్నా, ఎంత ఫారిన్‌కారు అయినా రోడ్డు మధ్యలో గొయ్యి ఉంటే తప్పుకొని ప్రక్కగా పోవలసిందేగాని, దానిని గోతిలో పడేస్తామా? పడేస్తే దెబ్బ దానికి తగలదు. అది జడం. దెబ్బ మనకు తగులుతుంది. ఇవన్నీ తెలుసు మనకు. ఇదంతా వివేకమే. అయితే ప్రపంచవివేకం.

మనమందరం వివేకదృష్టి కలిగే ఉన్నాము. కాని దానికి ముందు 'అ' చేరింది. అందుకని అది ప్రపంచ వివేకం, అవివేకం అయింది. అటువంటి వివేకం కాదు మనకు కావలసింది, మనకు ఆధ్యాత్మిక వివేకం కావాలి. మనం ఆధ్యాత్మిక వివేక దృష్టితో ఆలోచించాలి. అటువంటి వివేక దృష్టితో వినాలి, చూడాలి. మనం ఏది చేసినా, ఆ వివేకదృష్టితో చేసినంత వరకు ప్రపంచంలో ఎవ్వరికీ ఏ నష్టమూ రాదు. మనం పారమార్థిక దృష్టి కలిగి ఉండాలి. ప్రపంచంలో ఎన్నో మనను ఆకర్షిస్తాయి. ఎన్నో శాస్త్రాలున్నై. కాని మహాత్ములెవ్వరూ ఇన్ని శాస్త్రాలు చదివితేకాని, లేదా ఇన్ని కిలోల పూలతో పూజ చేస్తేగాని మీరు భగవంతుణ్ణి చేరలేరు అని చెప్పలేదు.

కొందరు అమ్మ అంటే ఎంతో అభిమానమండీ అంటారు. అభిమానం అంటే ఊరికే వస్తూపోతూ ఉండటం కాదు. అలా అని జగజ్జనని ఎంత బంగారుకొండ అయినా పనులన్నీ మానుకొని వచ్చి ఇక్కడే కూర్చుంటా అంటే గురుదేవులు ఎప్పుడూ ఒప్పుకొనేవారుకారు. పనులు చేస్తూనే, నీ స్వధర్మం నిర్వహిస్తూనే వస్తూపోతూ ఉండాలి.

గురుదేవులు మన మనస్సులలో చేరి నిత్యానిత్య వివేకదృష్టి మార్గం ద్వారా అనిత్యమైన దానిలో నిత్యమైనదానిని చూపుతున్నారు. ఈ అనిత్యమైన జగత్తులో, అలాగే ఈ అనిత్యమైన దేహంలో నిత్యమైనది ఉన్నది. ఫ్యాన్‌ను ఉపయోగించుకోకపోతే ఏమౌతుంది? వేస్ట్(Waste). నువ్వు లక్షలుపోసి కొన్నాసరే, రోడ్డు మీదకు వస్తే మట్టి అవుతుందని, పాడౌతుందని కారుని షెడ్(Shed)లోనే ఉంచేస్తే వేస్ట్(Waste). అలాగే సోఫామీద కూర్చోకపోతే అది వేస్ట్. సోఫామీద కూర్చోవాలి. మీద కూర్చోపెట్టుకోవటం దాని స్వభావం. అలాగే చలనం అనేది కార్, ఫ్యాన్ల స్వభావం. (హాల్‌లో సోఫామీద ఉన్న శ్రీబాబూజీ మూర్తివైపు చూపుతూ) ఆయన అంటే అలాగే కదలకుండా కూర్చున్నారు. అందువలన ఆయనకు వేసినది పీఠం అయింది. అలాగే ఇప్పుడు మాతాజీ కూర్చున్న సోఫాను, మళ్ళీ మాతాజీ ఎప్పుడు వస్తారో అప్పటిదాకా వాడకుండా, భక్తి భావంతో అలాగే అట్టేపెడితే మంచిదే, అప్పుడు అది కూడ పీఠం అవుతుంది.

ఆయనమనలో ఉండబట్టే మనను మనం గౌరవించుకుంటున్నాము. ఎంతవరకు ఈ దేహానికి ఆ గౌరవం? అందులో చైతన్యం ఉన్నంత వరకే. అదిలేకపోతే ఎప్పుడు తీసికెళ్తారు? అని అడుగుతారు.

సుహృద్భావన చెయ్యాలి. మనస్సు చేసే భావన ముఖంలో కనిపిస్తుంది. మల్లెపూలనుంచి వచ్చే వాసన సువాసనగానే ఉంటుంది. బురదగుంటనుండి వచ్చే వాసన దుర్గంధంగానే ఉంటుంది. ఆ రెండు వాసనలనూ మనలో పెట్టాడు భగవంతుడు. బాగా ఘుమఘుమలాడుతున్నది అని గోంగూర పచ్చడితింటాం. తినేటప్పుడు ఘుమఘుమలాడుతూ బాగానే ఉంటుంది కాని మర్నాడు బయటకు వచ్చేటప్పుడు దుర్వాసనే. ఎందువలన? మనలోనే ఉంది సెప్టిక్ ట్యాంక్.

ఇది కానిది, అది పోనిది, దీనిని బాగా చెయ్యాలి అనుకుంటే చాలదు. అలాగే భగవంతుడు ఉన్నాడు, భగవంతుడు ఇంతగొప్పవాడు, అంత గొప్పవాడు అని చెప్తే సరిపోదు. భగవంతుడు 'నాలో ఉన్నవి నీలో అలవరచుకో. నాలో లేనివి నీలో లేకుండా చేసుకో. అప్పుడు నీవుకూడ నాలాగే ప్రకాశిస్తావు' అంటున్నాడు. భగవంతుడిలో లేనివి ఏవి? ఈర్ష్య, అసూయ, ఓర్వలేనితనము, అసహనము.

ప్రపంచంలో ఎన్ని ఉన్నా అవన్నీ మార్పు చెందేవేకదా! ఇల్లు ఉన్నా ఆ ఇంట్లో ఉండేవాడు ఒకడు ఉండాలి కదా? లేకపోతే ఆ ఇంటికి విలువ ఏమున్నది? మంచి కారు కొన్నా అందులో ఎక్కేవాడు ఒకడుండాలి. గురుదేవులు చాలసార్లు చెప్పేవారు. ఒక పూరిపాక శుభ్రంగా అలికి ముగ్గులు పెట్టినది ఉన్నది. దాని ప్రక్కనే కోట్లు పెట్టి కట్టిన ఒక భవనం పాడుపడిపోయినది ఉన్నది. అందులో భూతాలు ఉన్నై అని కూడ తెలిసింది. మనం దేనిని ప్రేమిస్తాము? ఆ పూరిగుడిసెనేకదా! ఆ భూతాలకొంపలో ఉండే బదులు ఏ చెట్టు క్రిందైనా హాయిగా ఉండవచ్చు అనుకుంటాము. ఇక ఆ చెట్టుకు సమీపంలో ఏదైనా ఒక నదికూడ ఉంటే ఆనదిలో నీరు ప్రవహిస్తూఉంటే ఇంకా ఎంత హాయిగా ఉంటుంది. నీళ్ళలో నుంచే కరెంట్ పుడుతుంది.

మనకు ఈ జీవితం ప్రారబ్ధవశాత్తూ వచ్చింది. వచ్చిన తర్వాత మనం ఏమి చేస్తున్నాము? కర్మరహితం చేసికొంటున్నావా? తెల్లవారుజాముననే లేచి మనం ఆశ్రయించిన దేవతామూర్తిని ప్రార్థన చేసుకోవాలి. అందుకు అడ్డం వచ్చేవి మనలో ఉన్నవే. మనలో ఉన్నవే అడ్డం వస్తున్నైకాని, క్రొత్తగా బయట నుంచి వస్తున్నవి ఏవీలేవు. నా మనస్సు నిలవటం లేదండీ అంటారు. అలా చెప్పేది కూడ మనస్సే. మనలో రెండు మనస్సులు ఉన్నై పాముకు రెండు నాల్కలు ఉన్నట్లు.

ప్రపంచంలో ప్రవర్తిస్తున్నంతసేవు మనస్సు మనస్సుగా ఒక ఇంద్రియంగా ఉంటున్నది, కాని ఆ మనస్సే భగవద్విచారణలో మునిగిపోతే అప్పుడు అది మనస్సుగా ఉండదు. ఆది బుద్ధిలో చేరుతున్నది. బుద్ధి గడ్డితిని ఈ పని చేశాను అనటం మనం వింటుంటాము. బుద్ధికి కూడ స్వాతంత్ర్యం లేదు. దాని వెనుక ఆత్మ ఉన్నది. మన ఇంట్లో ఒక మెయిన్ స్విచ్ ఉన్నది. అది మన ఇంట్లో ఉన్న లైట్లు, ఫ్యాన్లు అన్నింటిని కంట్రోల్ చేస్తుంది. అలాగే అన్ని ఇళ్ళకు కలిపి బయట పవర్‌హౌస్ దగ్గర ఇంకొక మెయిన్ స్విచ్ ఉన్నది. మన ఇంట్లో మెయిన్ స్విచ్‌కి కరెంటు బయటనుండి వస్తోంది. మన ఇంట్లో మెయిన్ స్విచ్‌ను ఆఫ్‌చేస్తే బయటనుండి వచ్చే కరెంటు మన ఇంట్లోకి రాదు.

-సశేషం

# శ్రీ బాబూజీ దివ్యవాణి

(గతసంచిక తరువాయి)

నిజానికి గురువు మానవరూపంలో సాక్షాత్కరించిన ఆ పరమేశ్వరుడే. శిష్యులతో సన్నిహిత సంబంధాలు కల్గియుండటానికి అవకాశం ఇచ్చేది ఆయనే. గురువు ఆత్మసాక్షాత్కారంపొంది, భగవంతునితో సారూప్యంచెంది, ఆయనలో విశ్వాసం పెంపొందించడానికి శిష్యులలో ఆధ్యాత్మిక అనుభవాలకు ప్రేరణనిచ్చేది గురువే.

ఒక ఆలయంలోని విగ్రహంలో భగవంతుని దర్శించడం కష్టం, కాని శిష్యులపై అపారకరుణ, ప్రేమానురాగాలను వర్షించి, వారికి మనోశాంతి, ఆత్మతృప్తి ప్రసాదించి, తన ఆశీస్సులతో వారు ఆధ్యాత్మిక దివ్య అనుభూతులను పొందేటట్లు చూసే గురువు - ఈశ్వర చైతన్యం మూర్తీభవించిన గురువుద్వారా భగవత్‌సాక్షాత్కృతి పొందడం తేలిక.

గురుదేవునికి, నిజమైన శిష్యునికి మధ్య దేశకాలాదులవంటి భౌతిక అవధులు లేనేలేవు. కాని శిష్యుడికి గురుదేవుడి పాదాలచెంత తనను తాను అర్పణ చేసుకొన్నప్పుడే అటువంటి సంబంధం సుసాధ్యం. అప్పుడే శిష్యునికి శాశ్వతమైన భద్రత ఉంటుంది. అప్పుడే తన గురుదేవుడు తన హృదంతరాళాలలోనే వెలుగుతున్నట్లు శిష్యుడు భావించగలడు. నిజానికి శిష్యుడు గురుదేవునితో సారూప్యం చెందగలడు.

కాని, "గురుదేవులు నిర్దేశించని పక్షంలో అట్టి సద్గురువు లభించడం దుర్లభం. ఈ 20వ శతాబ్దంలో రకరకాల గురుదేవులు కనిపిస్తుంటారు. కొందరు కాషాయాంబరధారులైతే, మరికొందరు విలాసజీవితం గడుపుతూ పాశ్చాత్య సంస్కృతి, నాగరికతలకు దాసులైన ఆచార్యులు. ఆముష్మిక అనుభవాలు లేకుండా, శుష్కమత ప్రబోధలుచేసే సాహితీ ప్రకాండులు, మహిమలు ప్రదర్శించే బాబాలు, ఐహిక సంపదలను ఆర్జించడానికి అణిమాది అష్టసిద్ధులను వినియోగించే తాంత్రికులు, నిజమైన సన్యాసం స్వీకరించని కపట సన్యాసులు కోకొల్లలు.

ఒక నిజమైన సద్గురువును సంపాదించ గలిగినవారు తమలక్ష్యాన్ని సగంనెరవేర్చినట్లే. కాని మిగతా లక్ష్యం సఫలీకృతంకావడమే మరింత కష్టం.

గురుదేవునిపట్ల విధేయతతో మెలగాలి. ఆయన బోధించే సూత్రాలకు తు.చ. తప్పకుండా కట్టుబడి ఉండాలి.

ఆదశ చేరుకొన్న పిమ్మట అత్యున్నతమైన 'సాధన దశ' చేరుకోవటం మరీ కష్టం. గురుదేవుని ఆశీస్సులు పొందటానికి ఈ దశ చేరుకోవటం అత్యంతముఖ్యం. మనం ధ్యాననిమగ్నులమవుతున్నకొలదీ, కేవలం దైవారాధనకై ఆలోచనలను కేంద్రీకరింప చేసుకోడానికి ప్రాపంచిక విషయాలనుండి మనస్సును మరల్చడానికి మనకు మరింతగా శక్తి వస్తుంది.

మన పతనానికి మూలహేతువైన సకల వ్యామోహాలనుండి మన మనస్సును మరల్చగల్గేది గురుదేవుడు ఒక్కడే. గురుదేవునికి మనల్ని అంకితం చేసుకోవడమంటే, భౌతిక, మానసిక, ఆధ్యాత్మిక అర్పణ అన్నమాట. అప్పుడే మనం మనల్ని మరిచిపోయి, ఎటువంటి ఫలితాన్నీ ఆశించకుండా మన విధ్యుక్త ధర్మాన్ని మనం నెరవేరుస్తాం. అటువంటి గురుదేవుని లభింప చేసుకోవటం అదృష్టవంతుల ఏకైక పరమావధి. ఆయన పవిత్ర పాదాలకు జీవితాన్ని అంకితం చేసుకోవడం, ఎటువంటి పరిస్థితులలోనూ ఆ పాదాలను వదలకుండా నిరంతరం ఆ పాదాలచెంత ధ్యానం చేయడమే మన జీవితధ్యేయం కావాలి. మన విశ్వాసం నమ్మకం, ఆరాధన పరిపూర్ణమైనవి అయితే మిగిలిన విషయాలన్నీ గురుదేవులే చూసుకొంటారు. శ్రీహనుమత్ కాళీ వరప్రసాదబాబు దివ్య ప్రబోధం సారాంశం ఇదే. *

**అశ్రుకణం**

పోతునూరి తాతయ్యగారి మనుమడు చి॥శివానంద ప్రసాద్ ది.23-7-2009 గురుసాయుజ్యం పొందాడు. ఇతడి వయస్సు 27సం॥ ఇతని తల్లిదండ్రులకు, సోదరికి శ్రీగురుదేవులు మనశ్శాంతిని ప్రసాదించెదరుగాక!

**అశ్రుకణం**

పోతునూరి తాతయ్యగారి మనుమడు చి॥ జానకిరామ చరణ్ ది.25-7-2009 గురుసాయుజ్యం పొందాడు. ఇతడి వయస్సు 23సం॥ ఇతని తల్లిదండ్రులకు, సోదరునికి శ్రీగురుదేవులు మనశ్శాంతిని ప్రసాదించెదరుగాక!

# సమర్థ సద్గురు నాథుని దివ్య చరిత్ర

(గత సంచిక తరువాయి) - స్వామి విజయేశ్వరానంద ప్రసాద్

హిమాలయాలలోను, శ్రీశైలంలోను, పాపికొండలలోను, సుదీర్ఘ తపశ్చర్యను కొనసాగించి, సత్య శోధనలో కృతకృత్యులైన శ్రీబాబు, పరమాత్మను తాము సగుణంగా దర్శించడమే గాక, నిర్గుణమైన ఆ పరమాత్మ తత్త్వముతో తమ అభిన్నత్వమును అనుభవించి, ఆ అనుభవస్థితిని కూడా దాటినదై, సగుణ నిర్గుణాతీతమై, రెండవది లేనిదై కేవలము తానే అయిన కైవల్య స్థితిలో శాశ్వతంగా నిలచిపోవాలని, హిమాలయ ప్రాంతంలోనే తమ అవతార కాలాన్ని గడిపి వేయాలని, అనుకున్నారు.

కాని తమ దేశ పర్యటన కాలంలో, ప్రజలలో విధి వంచితులై , అగ్ర వర్గాల దమన నీతికి, దౌర్జన్యానికి బలియై, నిస్సహాయులై ఆక్రోశిస్తున్న అసంఖ్యాకులైన నిమ్న జాతులవారు చేస్తున్న ఆక్రందనలు, పడుతున్న పడరాని పాట్లు, శ్రీబాబు దయార్ద్ర హృదయాన్ని తీవ్రంగా కలచి వేశాయి. అగ్ర జాతులమని చెప్పుకునే వారు ఈ నిమ్న జాతుల వారిని, అంటరాని వారుగా పరిగణించటం, హింసించటం, ఆకలితో, దారిద్ర్యంతో, అవిద్యతో అలమటించి పోతున్న ఆ నిర్భాగ్యులపై యిసుమంతైనా కనికరం చూపకపోవడం శ్రీబాబు సహించలేక పోయారు.



స్వార్థపరులైన అగ్రజాతులవారు, విద్యను నిమ్నజాతులవారికి అందకుండా చేయటం, సేవకా వృత్తికే వారిని పరిమితం చేయటం, శ్రీబాబుకు దుర్భరమైన ఆవేదన కలిగించింది. సంస్కృతభాషను అభ్యసించడానికి వారు అనర్హులన్నారు, వేదం వినటానికి, కనీసం ప్రణవం ఉచ్చరించటానికైనా వారు పనికిరారన్నారు. చివరకు సర్వజీవరాసులకు తండ్రి అయిన పరమేశ్వరుని ఆలయంలో ప్రవేశించడానికి కూడా వారు అనర్హులని నిషేధించారు. అవ్యాజ, అపార ప్రేమస్వరూపిణి అయిన జగన్మాత తన సంతానంలో కొందరికి జరిగే యీ అన్యాయాన్ని

సహించగలదా? సహించలేదు. కనుకనే జగన్మాత శ్రీబాబు రూపంలో మానవాళి మధ్య అవతరించింది. అస్పృశ్యతా భావాన్ని, అసమానతలను, భేద దృష్టిని తొలగించుకొని సర్వజీవులు సమభావముతోను, ప్రేమదృష్టితోను మెలగండని బోధించింది. సమసమాజ వ్యవస్థను నెలకొల్పింది. అదే తన అవతార కార్యమని నిశ్చయించుకొన్న శ్రీబాబు జీవ రక్షణ దీక్షా కంకణులై మానవకోటి మధ్యకు వచ్చి నిలిచారు.

ఇలా తన అవతార కార్య నిర్వహణకు సిద్ధం కావటం కోసం శ్రీబాబు జరిపిన సాధనలను గూర్చి వారి యాదృచ్ఛిక ప్రసంగాల ద్వారాను, వారికి ఆత్మీయులైన భక్తుల ద్వారాను లభించిన వివరాలను తెలుసుకుందాము.

శ్రీబాబు బాల్యం నుండి శ్రీరామ తారక మంత్రోపాసన చేశారు. శ్రీరామచంద్ర ప్రభువు దివ్య మంగళమూర్తి నెన్నోసార్లు దర్శించారు. తమ పర్యటనలోను, సాధనకాలంలోను, అనుక్షణము, మారుతాత్మజుడైన శ్రీవీరహనుమానుడు నీడవలె తమను వెంట నంటి యుండి రక్షణ భారము వహించేవారని శ్రీబాబు అనేక సందర్భాలలో వెల్లడించారు. అది యదార్థమేనా అని తమకు సంశయం కలిగినప్పుడల్లా హనుమద్దర్శనము కలిగి, ప్రత్యక్ష అనుభవమును పొందేవారమని చెప్పారు. “నా ఆదర్శ దైవమైన శ్రీ వీరహనుమానులు అభయముద్ర దాల్చి నా ఎదుట నిలిచి ‘ఇప్పుడు నీవు దర్శిస్తున్నది, పొందుతున్నది నీ స్వస్వరూపము యొక్క అపరోక్షానుభవమే’ అని పలికిన పలుకులు వింటూ మైమరచిపోయే వాణ్ణి” అని శ్రీబాబు తమ అనుభవమును గురించి తెలిపారు. మాయామానుషమైన శ్రీరామ తత్త్వము, లీలా మానుషమైన శ్రీకృష్ణ తత్త్వము, అనంత శక్తి స్వరూపిణి అయిన జగన్మాత యొక్క నిజ తత్త్వము ప్రస్తావనకు వచ్చినప్పుడల్లా శ్రీబాబు అత్యంత పరవశులై ప్రసంగించే వారు. స్వాత్మ తత్త్వము ఎవరికి పరమానందం కలిగించదు?

శ్రీరామ ప్రభువు పరమానుగ్రహమును చూరగొన్న శ్రీబాబుకు , బ్రహ్మ విష్ణు, శివాత్మకమై, ప్రణవ స్వరూపిణియై, సర్వదేవతా మూర్తులకు, స్థావర జంగమాత్మకమైన సకల జగత్తుకు మూలమై, అనంత శక్తి స్వరూపిణియైన జగన్మాత తన దర్శనమును అనుగ్రహించి, నిజతత్త్వమును వెల్లడించింది.

-సశేషం

# శ్రీ గురు సేవలో పండిన పాండు

-విజయేశ్వరానంద ప్రసాద్

ఎన్నో జన్మల పుణ్యఫలం రాశీభూతమైతేగాని మానవ జన్మ లభించదు. అది లభించినా ఉత్తమ సంస్కారం వలనగాని మోక్షేచ్ఛ కలగదు. మోక్షేచ్ఛ కలిగినా, దైవానుగ్రహం ఉంటేగాని సద్గురు ప్రాప్తి కలగదు. మరి అభము శుభమూ తెలియని ఒక మానవుని పసితనంలోనే, ఆ దేవుడు అతని యింటికి సద్గురు రూపంలో వచ్చి, అతని కుటుంబ సభ్యుల యోగక్షేమమునూ, ఆలన పాలనభారాన్నీ తానై వహించి, హితుడై, బంధువై, దైవమై, గురువై అతనిని సజ్జనునిగా, కుల వృత్తిలో నిపుణునిగా, వితరణశీలిగా, త్యాగధనునిగా, సేవాధురంధరునిగా, ఉత్తమ శిష్యునిగా తీర్చి దిద్దుకొని తనలో చేర్చుకున్నారంటే, ఆ ధన్యజీవి మహాభాగ్యాన్ని ఎంతని ఉగ్గడించగలము! అంతటి పరమ పుణ్యాత్ముడు బచ్చు పాండురంగ శ్రీశైలరావు. ఆత్మీయులందరికీ అతను "పాండు".

పుట్టింది 1933లో తూనుగుంట్లవారి వంశంలో. పెంపు వెళ్ళింది బచ్చువారి యింటికి. అలా యిద్దరు తల్లుల ముద్దు కుమారుడైన పాండు, మేనమామలైన మాజేటి వారింటి అమ్మాయి రుక్మాబాయిని వివాహం చేసుకుని మూడు కుటుంబాల ముచ్చటలకూ మూలమైనాడు. అతని మూడునాలుగేళ్ళ వయస్సులోనే సర్వాధిష్ఠాన చైతన్య స్వరూపులైన సమర్థ సద్గురు దేవులు శ్రీ హనుమత్కాళీ వరప్రసాద బాబూజీ మహరాజ్ వారు తమ దివ్య చరణరజంతో వాళ్ళ గృహాన్ని పావనం చేశారు. ఆనాడే ఆకుటుంబ సభ్యులందరికి భాగ్యోదయమైంది.

వివాహమైన యేడాది తిరగకముందే పాండుకు డబల్‌టైఫాయిడ్ జ్వరం వచ్చింది. శ్రీ గురుదేవులు అతని ధర్మపత్ని రుక్మాబాయికి అభయమిచ్చి తమ దివ్య తపశ్శక్తితో అతనికి స్వస్థతను చేకూర్చారు. జన్మనిచ్చిన తండ్రి, పెంపుడు తండ్రి గతించినా జగత్పిత అయిన శ్రీగురుదేవులనే తనకు జన్మ రాహిత్యమును పొందించగల జనకునిగా పాండు గుర్తించి ఆశ్రయించుకున్నాడు. అతనికి శ్రీగురుకృపతో యిద్దరు కుమారులు, నలుగురు కుమార్తెలు కలిగారు.

ప్రధమ దర్శనమైననాటినుండి పాండుగారి కుటుంబంలో ప్రతి ఒక్కరు శ్రీ బాబూజీ మహరాజ్ వారి వాక్కునే శిరోధార్యంగాను తమకు అత్యంత శ్రేయోదాయకంగాను భావించి ఆచరించుకున్నారు. అత్యంత వినయ, భయ, భక్తులతో స్వామిని సేవించుకున్నారు. అంతటి తత్పరతతోనూ స్వామి వెంట

వచ్చిన భక్తులను కూడా సేవించుకున్నారు. ఎప్పుడు ఎందరు వచ్చినా, ఎన్నాళ్ళున్నా పగలు రాత్రి అనే భేదం లేకుండా ప్రతి ఒక్కరికి వారి వారి వ్యక్తిగత అవసరాలకూ అభిరుచులకూ అనుగుణమైన సేవలు అందిస్తూ, ఆత్మీయము, ఆప్యాయము అయిన ఆతిధ్యాన్ని అందించారు. అ సేవా తత్పరతనే పాండు తన జీవిత పరమార్ధంగా తన అంతిమ క్షణం వరకు పాటించాడు.

పరమ ప్రసన్నులైన శ్రీగురుదేవులు పాండు వ్యాపారంలో అతనికి ఎన్నో మెలకువలను అందించి, నైపుణ్యాన్ని ప్రసాదించి బహుముఖాభి వృద్ధిని సాధింప జేస్తూనే, అతని నిర్మల హృదయక్షేత్రంలో భక్తి బీజాలను నాటి, మొలకెత్తించి పెంపొందింపజేశారు.

వారింట్లో ఇంట్లో ప్రతి నెలా పూర్ణిమనాడు సత్సంగ సమావేశాలు, సద్గురు దేవుల దివ్య బోధామృతము, శ్రీ సద్గురు పాదపూజ, భక్త సమారాధనము, అలాగే సంవత్సరాది, సంక్రాంతి, వినాయక చవితి మొదలైన పండుగలకు కూడా విశేష పూజలు, భక్తసమారాధనలు జరిగేవి.

శ్రీగురుదేవులకు ఎప్పుడే సేవ అవసరమవుతుందో వారి మనస్సులో ఎప్పుడే సంకల్పం కలుగుతుందో అని పాండు ఎంతో తత్పరతతో తన మనస్సును అనుక్షణము శ్రీ గురుదేవులతో అనుసంధాన పరచి ఉంచుకునేవాడు. అందు వలన స్వామి తనకేమీ చెప్పకముందే, వారు సంకల్పించిన కార్యక్రమానికి కావలసిన ఏర్పాట్లన్నీ సిద్ధపరచి ఉంచేవాడు. స్వామి తమ ఆలోచనను పాండుతో ప్రస్తావన చేసేసరికి, తాను సిద్ధం చేసి ఉంచిన ఏర్పాట్లన్నీ స్వామికి వివరించి చేతులు కట్టుకుని నిలబడేవాడు. స్వామి ఎంతో సంబర పడిపోయేవారు. గురుదేవుల ఆంతర్యాన్ని గుర్తెరిగి తదనుగుణంగా మసలుకునే శిష్యుని కంటె గురుదేవునికి ప్రీతిపాత్రు లెవరుంటారు?

1961 నుండి 1965 వరకు ప్రతి కార్తీక మాసంలోను పూర్ణిమ సందర్భంగా శ్రీ గురుదేవులు అనేకమంది భక్తులతో శ్రీశైల యాత్ర జరిపారు. 200 మంది భక్తులు వారంరోజుల పాటు మల్లికార్జునస్వామికి సహస్ర ఘటాభిషేకము, లక్ష బిల్వార్చన, భ్రమరాంబా దేవికి లక్ష కుంకుమార్చన, శ్రీ భ్రమరాంబా మల్లికార్జునుల లీలా కళ్యాణ మహోత్సవము, శ్రీగురుదేవులతో బాటు శ్రీశైలక్షేత్రంలోని అన్ని పవిత్ర స్థలాల దర్శనము చేసుకునేవారు. ఇంతమంది భక్తులనూ గుంటూరు నుండి బయలుదేర దీసి, ఏ ఒక్క భక్తునికీ ఎటువంటి అసౌకర్యమూ కలుగకుండా కార్యక్రమం నెరవేర్చి అందరినీ తిరిగి గుంటూరులో దింపే వరకూ పూర్తి

బాధ్యతను పాండు తన భుజస్కంధాలపై వేసుకుని, శ్రీ సద్గురు దేవుల పరమానుగ్రహంతో చక్కగా యాత్ర పరిసమాప్తి చేసి గురుదేవులకు పరమానందాన్ని కలిగించేవాడు.

ఇంతటి మహత్తర కార్యక్రమ నిర్వహణకు ఎంత ద్రవ్యం వినియోగమై ఉంటుందో శ్రీగురుదేవులకు కూడా తెలియనీయకుండా పాండు ఖర్చు పెట్టేవాడు. స్వామి నిగ్గదీసి అడిగితే “ఇదంతా తమరు నాకు ప్రసాదించినదే కదా బాబూ! ఇది కూడా నా స్వార్థమేగాని యిందులో నేను చేసిన త్యాగమేమీ లేదు” అనేవాడు. అది నిజమైన గురుపుత్రుని లక్షణం.

అతని అనితర వితరణ గుణానికి ముగ్ధులైన శ్రీ గురుదేవులు “ మా పాండు చేతికి ఎముక లేదు’’ అనేవారు. ఏ కార్యక్రమాల ప్రస్తావన వచ్చినా “మా పాండు ఉన్నాడులే’’ అని గర్వంగా తన శిష్యుణ్ణి గురించి చెప్పుకునేవారు.

శ్రీ గురుదేవులు శ్రీకాళీగార్డెన్స్ ఆశ్రమ స్థాపనకు సమ్మతినిచ్చి నప్పటినుండి నిర్విరామంగా కృషి చేసి పాండు 1971 జూన్ 1వ తేదీన ఆశ్రమ శంకుస్థాపనకు స్థల సేకరణతో సహా అన్ని ఏర్పాట్లను పూర్తి చేసి, అర్ధరాత్రివేళ భక్తులందరినీ ఆ స్థలానికి తరలించి శ్రీగురుదేవులను కారులో తీసికొని వచ్చి శంకుస్థాపన జరిపించాడు. తరువాత నిర్మాణ విషయంలోను, 1972 మే 31వ తేదీ రాత్రి జరిగిన ఆశ్రమ గృహప్రవేశం విషయంలోను పాండు పడిన శ్రమ, తీసుకున్న శ్రద్ధ, పాటించిన సేవా తత్పరత నిరుపమానములు.

ఆ తరువాత కొన్నాళ్ళ వరకు ఆశ్రమంలో నివసిస్తున్న భక్తులకు ప్రతిరోజు ఉదయ సాయంకాలములందు భోజనం గుంటూరు తన గృహం నుంచి వ్యానులో తెప్పించేవాడు. ప్రభుత్వ విద్యుత్సరఫరా వచ్చే వరకు జనరేటర్‌తో ఆశ్రమంలో దీపాలు ఏర్పాటు చేశాడు. ఒక్క వాక్యంలో సారాంశంగా చెప్పాలంటే స్వామి కార్యమును స్వకార్యంగా త్రికరణ శుద్ధిగా ఆచరించుకున్నాడు. అతని తుది శ్వాస వరకు అదే నిష్ఠను నిలుపుకున్నాడు.

డిసెంబరు 1988లో శ్రీగురుదేవుల అవతార పరిసమాప్తి వరకు, అనంతరం ఆశ్రమాధిపతులైన పూజ్య శ్రీ మాతాజీవారి దివ్య చరణ సేవలో 2009 జులై 4వ తేదీన తన పాంచభౌతిక శరీరాన్ని పంచభూతముల పరం చేసి, సకల భూతనాధులైన సద్గురు దేవుల దివ్యసాయుజ్యం పొందే వరకు ఆశ్రమంలో ఏ కార్యక్రమాలు జరిగినా, అన్నిసేవలలోను ప్రథముడుగాను, ఎవరి దృష్టిలోను పడకుండా ఆఖరి వాడుగాను నిగర్విగా, నిరాడంబరుడుగా, నిస్వార్థ సేవా పరాయణుడుగా సమర్థ సద్గురు దేవులకు అత్యంత ఆత్మీయుడుగా పాండు సార్థక జన్ముడై శ్రీగురు భక్తులలో అగ్రశ్రేణిలో శాశ్వత స్థానం పొందగలిగాడు. *




(గతసంచిక తరువాయి)

-రమణ ప్రసాద్

"అక్రూరుడా!" ఉద్ధవుని రోమరోమం పులకించింది. ఈ నగరంలోకి అక్రూరుడేగా మొదటిసారిగా తనని తీసుకువచ్చింది! ఆయన ఇంకా జీవించే ఉన్నాడా? ఉద్ధవునికి ఆశ్చర్యం, ఆనందం కలిగాయి. "నన్ను వెంటనే అక్రూరుని వద్దకు తీసుకు వెళ్ళు నాయనా! ఆహా ఎన్ని సంవత్సరాల తర్వాత నాకు అక్రూరుని దర్శనం కలగబోతోంది!"

అలా అంటూనే ఉద్ధవుడు గత స్మృతులలోకి జారుకున్నాడు... ద్వారకానగరం నుండి తను పరిభ్రమణం మొదలు పెట్టిన దగ్గరనుండీ జరిగినవేవీ తనకు తెలియవు... మధురానగరానికికూడా తాను అపరిచితుడైనవానిగా, ఒక అతిథిగా అయినాడు అంటే అందులో ఆశ్చర్యమేమీ లేదు.

"మీకు... మీకు... అక్రూరుడు తెలుసా?" ఆ యువకుడు ఎంతో గౌరవభావంతో అడిగాడు. అతని కళ్ళలో ఆశ్చర్యం తొణికిస లాడుతోంది.

"వత్సా!" ఉద్ధవుడు నవ్వుతూ ఇలా అన్నాడు" ఒక్క అక్రూరుడేకాదు, ఉగ్రసేనుడు, వసుదేవుడు, కంసుడు ఇంకా స్వయంగా కృష్ణుడు...వీరందరితో సహవాసం చేసిన సౌభాగ్యం ఈ వృద్ధుడికి లభించింది..."

" ఓహో అలాగా? అయితే మీరు! మీరు!" ఆ చుట్టుప్రక్కల ఉన్న నగరవాసులందరూ ఆశ్చర్యంగా చూస్తూ ఉద్ధవుని చుట్టూ గుమిగూడారు.

"నా పేరు ఉద్ధవుడు నాయనా...!" అన్నాడు ఉద్ధవుడు వాత్సల్యంతో ఆ యువకుని బుజంమీద చెయ్యి వేసి.

"మీరు... మీరు ఉద్ధవులా!" అన్నారు అక్కడ చేరినవారందరూ ఏక కంఠంతో... ఉద్ధవునితో నవతరంవారికి పరిచయం లేకపోయినా, ఆయన పేరు వినిఉన్నారు. అందరూఉద్ధవుని ముందునుండి తప్పుకొని ఒక్కొక్కరుగా వచ్చి ఉద్ధవునికి సవినయంగా నమస్కారం చేశారు.

"క్షమించండి ఉద్ధవా! నేను తమను గుర్తు పట్టలేకపోయాను" అన్నాడు ఉద్ధవునితో ఒక వయోవృద్ధుడు సంభాషణ ప్రారంభిస్తూ... మధురా నగరంలో

మిమ్ము ఒక అపరిచితునిగా భావించి తప్పు చేశాము... ఈ సమగ్ర నగరం అంతా మీ గృహమే మహాశయా!... మీరు... మీరు...వసుదేవ, కృష్ణుల వద్దనుంచి వస్తున్నారు కదూ!... మేము కృష్ణుని గురించి వినటానికి ఎంతో కుతూహలంగా ఉన్నాము...!''

"ఔను... ఔను...'' అన్నారందరూ ముక్తకంఠంతో. "మేము కృష్ణుని గురించి విన్నాము... మీరు కృష్ణుని వేణు గానాన్ని తప్పక వినేఉంటారు... అక్రూరులవారు ఒకసారి ఆ వేణువు గురించి చెప్పారు...!''

"మాకు కృష్ణుని మయూరపింఛం గురించి తెలియజేయండి...!''

"కృష్ణుడు కంసుని అత్యాచారాలనుండి వ్రజభూమిని విడిపించాడు అని విన్నాం - అది ఎలా విడిపించినదీ మాకు పూర్తిగా వివరించండి ఉద్ధవా! మీరు అదంతా మీ కళ్ళతో చూసిఉంటారు...!''

"ఇప్పుడు కృష్ణుడెక్కడ ఉన్నాడు?'' అని ఎవరో విహ్వాల స్వరంతో ప్రశ్నించారు. ఈ తరంవాళ్ళమైన మేము కృష్ణుని దర్శనానికి నోచుకోలేక పోయాము. మా ఈ దౌర్భాగ్యానికి అంతం ఎప్పుడు?''

ఉద్ధవుని వదనం మ్లానమైంది. అయన కనులలో వేదనఛాయలు కదలాడాయి. కొన్ని క్షణాల క్రితమే కాళిందీ తీరాన ప్రవాహంలో పడి విలీనమైన అశ్రుబిందువులో మయూరపింఛం మరల గాలిలో కదలాడినట్లైంది.

"మీరు ఈ వ్రజభూమిలో కృష్ణుని చూడలేదా? అదెలా సంభవం?'' తనను తాను సంబాళించుకొంటూ అన్నాడు ఉద్ధవుడు. "కంసుని సభామండపంలో మీకు కృష్ణుని పదాల సవ్వడి వినిపించలేదా! కారాగారంలోని ఊచల వెనుక బాల కృష్ణుని రోదనాల మధుర ధ్వనులు మీ చెవులకు సోకలేదా! ఇంకా... ఇంకా... యమునా ప్రవాహంలో కృష్ణుని స్పర్శ తగలలేదా! అదిగో! అటు చూడండి! ఆ తమాలవృక్షాల కొమ్మలను, కదంబ వృక్షాల కొమ్మలను చూడండి...''

ఒక్కసారిగా ఎన్నో జతల కళ్ళు ఆ దిశవైపుకు తిరిగాయి. ఆ వృక్షాలను వాళ్ళు రోజూ చూస్తూనేఉన్నారు. కాని... కాని... ఈ రోజు దృశ్యం వినూత్నంగా ఎందుకు కనిపిస్తోంది? ఇంతకు ముందెప్పుడూఇలా కనపడలేదే! ఉద్ధవుడు చెప్పినట్లు ఆ తమాలవృక్షాలలో, ఆ కదంబ వృక్షాలలో కృష్ణుని మయూరపింఛం కనిపిస్తోందే! ఆకులన్నీ మయూరపింఛాలైపోయాయి... అంతేకాదు... అచట వీస్తున్న గాలి తరగల ధ్వనులు మయూరపింఛాల మధ్య

నుండి వేణునాదాలుగా వివనపడసాగాయి... మరి మయూరపింఛం, వేణువు ఇక్కడే ఉన్నాయా... అవును, అక్కడే ఉన్నాయి...! ఇదే మయూరపింఛం, వేణువు -ఇదే కృష్ణుడు!

"కృష్ణా..."ఒక ధ్వని గాలిలో ప్రతిధ్వనించింది!

మధురలోని ప్రాసాదాలలో, ద్వారాలలో,బురుజులలోనుండి ఈ రెండక్షరాలధ్వని అలా ఎంతోసేపు ప్రతిధ్వనిస్తూనే ఉంది.

ఉద్ధవా? ఇదంతా ఏమిటి...? మేము... మేము... చూసినదంతా ఏమిటి? అని అడిగిన ఆ వయోవృద్ధునిలో ఆశ్చర్యానందాలు వెల్లివిరిశాయి.

"ఇదే ఇంక మనకు కృష్ణుడు నాయనా! ఇంతకుముందు మనలాగా శరీర ధారణచేసిన కృష్ణుడు ఇప్పుడు వీటన్నిటిలో వ్యాప్తుడై ఉన్నాడు..... కృష్ణుడు అస్థి, చర్మాలు ఉన్న దేహరూపంతో మనకిక ఎన్నటికీ కనిపించడు. అతని దేహ ధర్మం సమాప్తమైంది!" ఉద్ధవుడు చివరికి ఉన్నమాట చెప్పేశాడు.

దేహధారి అయిన కృష్ణుడు ఇంక లేడా?..... వారి తలపైన పిడుగు పడ్డట్లైంది. అందరూ మ్రాన్పడిపోయారు.... పురజనులందరూ అవాక్కైనారు! క్షణం క్రితం వారికి కృష్ణునిసాక్షాత్కారం చేయించిన ఉద్ధవుడే ఇప్పుడు కృష్ణుడి దేహధర్మం సమాప్తి అయిందని చెప్తున్నాడే! అని నగరవాసులు వికల మనస్కులైపోయారు. ఒకసారి తిరిగి తమాల వృక్షాలవైపు, కదంబ వృక్షాలవైపు దృష్టి సారించారు. తిరిగి భూమివైపు చూశారు.... అరే! ఇప్పుడే కదా కృష్ణుడు ఇక్కడ ఉన్నాడు! ఉద్ధవుడు మనకి కృష్ణుణ్ణి సాక్షాత్కారం చేయించాడు కదా! ఇప్పుడు ఆ మయూరపింఛం ఏమైంది? అదృశ్యమైపోయిందా? లేక ఈ ఆకుల వెనక దాగివుందా?

"అయ్యా! మీ కారణంగా మేము కృష్ణుని మయూరపింఛాన్ని స్పృశించగలిగాం.... వ్రజభూమిలో కృష్ణుడు లేకపోవటం అనేది ఎప్పుడూ ఉండదు. ఇది కూడా తమరే చెప్పారు.... మేమంతా దేహధారి అయిన కృష్ణుడు ఉన్నాడనే భ్రమతో ఉన్నాము.... మీరాభ్రమను తొలగించారు" అని వారిలో ఉన్న ఒక వృద్ధుడు అందరి మనసులలో ఉన్నమాట చెప్పాడు. -సశేషం

Printed, Published by C.V. Ramana Babu, on behalf of YOGINI SRI CHANDRA KALI PRASADA MATHAJI CHARITABLE TRUST and Printed at Samardha Sadguru Publications, D.No. 3-499, Sri Kali Gardens Ashram, Nambur - 522508, Guntur Dist., Andhra Pradesh, and published at D.No. 3-499, Sri Kali Gardens Ashram, Nambur - 522508, Guntur Dist., Andhra Pradesh. Editor - Guda Siva Rama Murthy,